శ్రీరస్తు.

# కుచేలోపాఖ్యానము

గట్టుప్రభుప్రణీతము.

(సటిప్పణము.)



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1915.

# పీఠిక.

---

దారిద్ర్య మనునది మహాదుఃఖము. దీనికంటె మించిన వ్యసనంబు వేఱొక్కటి లేదు. తక్కినదుఃఖములు కొంత కాల ముండి నశించునవి. ఈదుఃఖము తను వుండునంతవఱకుఁ దీఱనిది. ఈకుచేలోపాఖ్యానమున మొదటియాశ్వాసమునందలి 50 వ పద్యమున దీనిమహిమ వర్ణిత మై యున్నది. లోకములో దారిద్ర్యముచే మానవుఁ డకృత్యంబు లొనరించు ననియుఁ, దన్మూలంబునఁ బాపం బొడిఁ గట్టికొని, యంతమున నరక మనుభవించి మఱలఁ బాపఫలంబుగా దరిద్రుఁడుగానే పుట్టుచు గిట్టుచు నుండవలసిన దనియు స్మృతులు పలుకుచున్నవి. కావున దరిద్రుఁడగువాఁడు ఈస్మృతివాక్యాకర్ణనచే మెలఁకువ పడి పూర్వజన్మంబునఁ జేసినపాపకర్మంబునకు ఫలంబుగా నీ జన్మంబున నిట్టిలేమిడిదశ ననుభవించితిమి. పైజన్మమున నైనను కలిమి గలుగవలె నని కాని, లేక సకలాపదలకుఁ బుట్టినిల్లయిన యిట్టిజన్మమే యక్కఱలేదు. జన్మరాహిత్యరూప మైనమోక్షము గలిగినఁ జాలు ననికాని మది నెంచి యట్టిమోక్షప్రదుఁ డయినవానిని భగవంతుని నమ్మి యతనిని సేవించుచు యథాశక్తి యొక్కరి కుపకారము చేయుచున్నయెడల వాఁడు లేమిడివలనివంత నంతగాఁ బొందక తప్పించుకొని పోవుచున్నాఁడు.

కలిమిలేములు సతములు గావు గనుక, ఒకవేళ లేమిడి దశ పోయి కలిమి వచ్చినను దానిని స్థిర మని నమ్మి మనము

భగవంతుని మఱువఁ గూడదు. ఏలయనిన, జనులు చెడిబ్రతిన వారు. బ్రతికిచెడ్డవా రని యిరుతెగలుగ నుందురు. చెడిబ్రదికినవారు తమ మొందటిలేమిడి మఱచిపోయి, తామాగర్భశ్రీమంతులుగా నున్నామని తలఁచి త్రుళ్లుదురు. బ్రదికిచెడ్డవారు తమముందటి స్థితిని మఱుపక యొరుల మోములను జూచుటకైనను వగతురు. కావున కలిమివచ్చినను అది భగవంతుఁడిచ్చినది యనియే నమ్మి యాకలిమిని సత్పాత్రములం దుంచి, భగవన్నామస్మరణము విడువక చేయుచుఁ దత్ప్రినాదంబున జన్మరాహిత్యరూపం బైనశాశ్వతముక్తి నొందుచున్నారు. అను నీ విషయము ఈ కుచేలునియుపాఖ్యానము ప్రతిపాదించుచున్నది.

ఈ చరిత్రయందలి కొందఱిగుణములు.

కుచేలుఁడు నిరుపేదయై, తన పేదఱికమునకుఁ దోడుగాఁ బెక్కండ్రుబిడ్డలు గలవాఁడై యుండియు, తనగొప్పకుటుంబపోషణభారమునుగూర్చి చింతింపక, "అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్." అను భగవంతునివాక్యము నమ్మి యాతనిమీఁద నాభారము వేసియుండెఁ. తర్వాత నతఁడు తనభార్యప్రోత్సాహమున శ్రీకృష్ణునిఁ గల్మి వేఁడఁబోయి, యాప్రకారము సంపదను బొందియు, చెడిబ్రతికినవారివలెఁ గాక, తనముందటిస్థితిని మఱువక యాకలిమిని రక్షించుట 'అర్థానా మార్జనే దుఃఖ మార్జితానాం చ రక్షణే' అనున్యాయముంబట్టి శ్రమ మనియెంచి, తాను కలిమియందు విరక్తుఁడై శ్రీకృష్ణ పరమాత్మనే ధ్యానించుచుండి మోక్షమునొందెను

ఆకుచేలునిభార్య లోకమున కొందఱుస్త్రీలవలెఁగాక "లేమిడిని ఆలిగుణాలు కనిపెట్టవలెను" అను నీతివాక్యమును బట్టి, తన యిఱువదియేడుగురు బిడ్డలను బోషించుకొనఁజాలక పోయినను, తనభర్తను దూఱక, యాతఁడుదెచ్చినపిడికెడు దూసరివడ్లలోనే అతిథులకుఁ దనభర్తకునుబెట్టి, తానును దన బిడ్డలును దినుచు, దారిద్ర్యదశంగూర్చి తలపోసినఁ దనమగని మనస్సున కేమికష్టము వచ్చునో యనితలంచి, తనభర్త తన యందుఁ బ్రేమతో నున్నప్పుడు సంపల్లాభోపాయంబుఁ దెలిపి, మగని మనసును నొప్పింపక తన యిష్టలాభంబుఁ బడసెను గనుక, ఆమెయొక్క పతిభక్తి వెల్లడి యగుచున్నది.

శ్రీకృష్ణుఁడు తాను సకలలోక పూజ్యుఁడుగాను, సక లైశ్వర్యవంతుఁడుగానుండియు, ఐశ్వర్యమదాంధు లగుసామా న్యజనులవలెఁ గాక, తనబాల్యస్నేహితుఁ డగుకుచేలునిరాక విని తన దేవితోడిసల్లాపంబు మాని తటాలున పాన్పునుండి డిగ్గి, తా నాయమునీంద్రుని కెదురేఁగి, యతనిం దోడ్కొనివచ్చి తన పర్యంకంబునందుఁ గూర్చుండఁబెట్టి శిశ్రూషచేయుటచే, నతని విధేయత యిట్టిదనియు, లోకంబున నెంతధనికుఁడైనను సజ్జనులను మర్యాద చేయవలయుననియు, తన చెలికాండ్రు తన కుఁ బ్రేమతో నిచ్చిన తృణమునైనను కొండంతగా నెంచవలెనని యు, కృష్ణుఁడు కుచేలుని యభిప్రాయంబుగనిపెట్టి యాతఁ డడుగకమునుపే యతని కఖండైశ్వర్యము నొసఁగినాఁ డను టచే, లోకమున ధనికుఁడును తనవద్దకు వచ్చువారు నోరు తెఱచి యడుగకమునుపే, వారి మనోరథంబు నీడేర్చి పంపవల యుననియుఁ దెలియవలసి యున్నది.

ఇట్లు తక్కినవారిగుణములనుగూడఁ ౦యవలెను.
గ్రంథవిస్తరభీతిచే నవి విడువఁబడెను. బుద్ధిమం లు కథార
నంబుఁ గ్రోలి వారివారి గుణంబులను గ్రహించి దుష్ట ప్రపం
చమందు నడచుకొనుటకుఁ బ్రయత్నింపవలెను అని బోధిం
చుచు నీపీఠిక నుపసంహరించెదను.

## కవిజీవితాదులు.

ఈకుచేలోపాఖ్యానము భాగవతములోని గట్టు ప్రభు
వనుకవివరుఁడు భాగవతములోని యీకథను మా ము గైకొని
మృదుమధుర శైలిని కొంచెము విస్తరించి రచిం ను. ఇతఁడు
నియోగి. యల్లన మంత్రిపుత్త్రుఁడు. ఇతఁడు మొ టిమాశ్వా
సము మొదట జెప్పిన "భ్రమరాంబికావర..." నుపద్యము
వలన ఈతఁడు దేవి నుపాసించు వాఁడనియు, యకు నూ
ఱేసిపద్యములు చెప్పగలవాఁడనియు, ఒకపక్షమున ఒక నెలకు
ఒకటిచొప్పున గొప్పకావ్యములను రచించు ప్పగలవాఁడ
నియుఁ జెప్పుకొనియున్నాఁడు. ఇతఁడు నెల్లూరు ండలవాసి.
నూఱేండ్ల క్రిందట నున్నవాఁడని కవిజీవితముల వఁ దెలియు
చున్నది. ఈతని కవిత్వమునం దచ్చటచ్చటఁ గొ ్ల దోషము
లున్నను శైలిమృదువై, పెక్కు సంస్కృతలోకోక్తు ను, ఆంధ్ర
లోకోక్తులు గలిగి చదువరులకు మనోహరంబై యున్నది.



శ్రీ హయగ్రీవాయనమః.

# కుచేలోపాఖ్యానము

## పీఠిక.



మద్వ్రజాంగనాచిత్రచిత్రాంబర
చౌర్యచాతుర్యవిచక్షణుండు
దాపసభామినీదత్తవిశిష్టాన్న
బహుమధురాపూపభక్షణుండు
సకలగోపకవధూసముదాయకర్షణ
మత వేణునాదాభిమంత్రకుండు
ధేనుఖురాగ్రప్రదీపితాచలరేణు
కోమలారుణనిజకుంతలుండు
తే. ధరవిభేదనమాయావిధప్రశస్త
ఘోరపాషాణవర్షవిదారణుండు
మదనగోపాలకృష్ణరమాధవుండు
చెలఁగి జగముల నెల్ల రక్షించుఁ గాత. 1

శా. భూలోకంబున దేవకీరమణికిం బుట్టె న్వసన్నంద గో
పాలశ్రేష్ఠునకుఁ యశోదకు జగత్ప్రఖ్యాతిగా మోహాపుం
బాలుండై విహరించు నిర్మలపరబ్రహ్మంబు గొం డంచు వే
చాలం జాల నొసంగు భూజనులకుఁ సర్వంకషైశ్వర్యముల్.

క. మానక మూఁపును వీఁపును
మానినుల కొసంగు వేల్పు మన్మథసుఖవి
ద్యానిపుణుఁడు హరి జగతీ
మానవులఁ జిరాయురర్థమానులఁ జేయున్. 3

సీ. ప్రతిదివసంబు 'గో బ్రాహ్మణేభ్య శ్శుభ
మస్తు నిత్య' మ్మని యార్యు లాడఁ
గారుణ్యమునను 'లోకా స్సుఖినో భవం'
తనుచు మానులు వేదతతి వచింప
ధృతి 'నమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మ
ణహితాయ చ' యని యామ్నాయములన
గణుతింపఁగా 'నమోఘా బ్రాహ్మణాశీర్వ
దా' యని పెద్ద లందఱును బలుక
తే. నామహావచనములు తథ్యములు గాఁగ
శౌరి యత్యనుకంపానుసారమునను
సకలధేనువులను విప్రసంతతులను
శ్రీకరంబుగ నభివృద్ధిఁ జేయుఁ గాత. 4

వ. అని మఱియుఁ జతుర్దశభువనపరిపాలకుండును, యశోదా నందనుండును, దేవకీవసు దేవకుమారుండును, బూతనా ప్రాణాపహారుండును, దావానలభక్షణుండును, ద్రాప దీమానరక్షణుండును, వ్రజసుందరీమనోరంజనుండును, గాళింగగర్వభంజనుండును, గపటమానవక్రీడా ప్రమోదుండును, వేణునాదవినోదుండును, జరాసంధశిశుపాలసాల్వాది దుష్టనరనాయకమదవిదారణుండును, చాణూరమల్లవినాశ

కారణుండును, విప్రాంగనామానససరోరుహహంసుండును,
కంసనిధ్వంసుండును, గోపసుందరీవస్త్రతస్కరుండును, సక
లప్రభావిజితశతకోటిభాస్కరుండును, సమస్తదిగంతవిశ్రాం
తప్రభావుండును, మహానుభావుండును నైన శ్రీకృష్ణదే
వునిం బ్రశంసించి మఱియును. 5

తే. అవనిసురభామినియుఁబోలె నద్దమరెయి
స్వప్నమున వచ్చి కరుణాప్రసాదమునను
గవిత నాకు నొసంగు శ్రీకంఠసాధ్వి
భ్రమర వినుతింతు వాక్ప్రౌఢిమమును మెఱయ. 6

తే. వ్యాస వాల్మీకి మల్హణ వామదేవ
భట్టభాణ భారవి శివ భద్ర మాఘ
బాణభవభూతి బిల్హణ పవనతనయ
కాళిదాసాదు లగుమహాకవులఁదలఁతు. 7

క. ఒకమాటఁ బలుక లేరట
చకితమనస్కులును గాక చక్కఁగ సభలన్
సకలార్థసాధనము లగు
సుకృతులు కుకవులకుఁ దరమె జోడింపంగన్. 8

క. కుమతులు విరచించుప్రబం
ధములు ప్రసిద్ధంబులుగునె తద్‌జ్ఞులు మెచ్చన్
భ్రమరాప్రసాదవాక్యము
లమితములుగ మెఱయుఁగాక యధిపులసభలన్. 9

తే. ఏఁ బ్రబంధంబు రచియింప నెదను బూను
నపుడె సాక్షాత్కరించి చిత్తాంబుజమున

భ్రమర నిలిచి సృజించు సద్భాషణముల
నస్మదీయప్రసంగ మెందైనఁ గలదె. 10

క. డంబము గలకవులు కవి
త్వంబులఁ బూనుదురు రిత్తఁ దమచే నగునే
యంబాప్రసాదమహిమ వి
డంబింపక కలవె యతిసుధావిస్ఫురణల్. 11

సీ. భ్రమరాంబికావరప్రభవదన్యకవిత్వ
విద్యాప్రవీణత వెలసినాఁడ
ఘటికాశతగ్రంథఘటనాసమంచిత
చాతుర్యమహిమకుఁ జాలినాఁడ
బ్రౌఢిమ నేకైకపక్షమాసమహాప్ర
బంధకల్పనశక్తిఁ బ్రబలినాఁడ
మఱియు నాశువు చిత్ర మాధుర్యవాక్యప్ర
గల్భనంబున నుతుల్ గాంచినాఁడ

తే. శ్రీకుధరమల్లికార్జునశ్రీపదాబ్జ
మత్తభృంగాయమానసన్మానసుండ
సత్కవీశ్వరకరుణాప్రసాదవశుఁడ
గట్టుప్రభునామధేయవిఖ్యాతయశుఁడ. 12

క. నరులకు నంకితములుగా
వరకృతు లొనరింప మిగుల వాంఛలు లేమిఁ
గరుణారసపూరితుఁ డగు
హరికి సమర్పింతు సముదితానందమునన్. 13

## షష్ఠ్యంతములు.

క. భూసు వనితాగత్త వి
భాసు వ కాన్వన్నభక్ష్యపానానుభవో
ల్లాసవ ద సున న కనుపమ
రాసక్రీ డావిలాస రమణీయునకున్. 14

క. బాణా ర కరలతికా
క్షీణల త్రువకు రూపజితమదనునకున్
జాణు మల్లరజక
పాణి వహాసునకుం గంసబలమథనునకున్. 15

క. నంద శోదాదిప్రియ
నందన నకు శమితదుష్టనరనాథునకున్
బృంద రక వరమాయా
సందర శిలాప్రవర్షసంహారునకున్. 16

క. వరధే వత్సగోపక
పరివృ నకు వేణునాదపరిపూర్ణునకున్
బరము కుసుమ ఛత్రీకృత
గురుత శైలునకు మదనగోపాలునకున్. 17

క. కరుణా రునకు యమునా
పరిరం ణావివిధసౌఖ్యపరితోషునకున్
సరసు ం సత్యభామా
పరిణ కేళీవిలాసభవ్యాత్మునకున్. 18

క. గతదా సన క్షలిత
వ్రతశీ న కఖిలగోపవనితాసురతా

ద్భుతకేళీలోలున కా
శ్రితజనవర్ధిష్ణునకును శ్రీకృష్ణునకున్. 19

వ. సమర్పణంబుగా నాయొనర్పం బూనినకుచేలోపాఖ్యానంబు
నకుం గథాక్రమం బెట్టిదనిన. 20



# కథాప్రారంభము.

క. శ్రీమద్భాగవతార్థ
స్తోమంబులు దెలుపునెడల శుకయోగీంద్రుం
డామోదమునఁ బరీక్షి
ద్భూమీశున కనియె వాక్ప్రభుత్వము మెఱయన్. 21

## పురవర్ణనము.

క. నెరయు ప్రసిద్ధము మధురా
పురముసమీపమునఁ బంట పొలఁతికి రత్నా
భరణంబై విలసిల్లును
నరనాథ యవంతిపట్టణశ్రేష్ఠ మిలన్. 22

మధురగతి రగడ.—

అది గడు నున్నత మయ్యేడికోటలు
సదనం బగు నచ్చపుఁబూఁదోఁటలు
మాణిక్యంబుల మయ మగు వేదులు
నాణెము లగు తిన్ననిబహువీథులు
కడు నైష్ఠికతలు గలిగినయాజులు
పుడమిని ధర్మముఁ బూనినరాజులు

భర్మవినిర్మితబహుసౌధంబులు
నిర్మలమణిమందిరయూథంబులు
పచ్చలు గూర్చిన బలుతోరణములు
మచ్చిక లెసఁగెడి మదవారణములు
కట్టందములుగఁ గట్టిన తేరులు
నెట్టనసాములు నేర్చినశూరులు
నవరత్నంబుల నయ మగు మేడలు
కనగూడినపటికంపులగోడలు
పటుతరగేహప్రాసాదంబులు
స్ఫుటతరభేరీపుటనాదంబులు
వేలుపుఁజేడెల వెలఁగొను వేశ్యలు
శ్రీలఁగుబేరునిఁ జెనకెడు వైశ్యులు
నిమ్ములఁబొడవగు నిలహోమంబులు
కమ్మని కృష్ణాగరుధూమంబులు
నిరుపమమాగధనిజగానంబులు
గరిమవహించిన ఘనయానంబులు
విమలోదకముల వెలసినబావులు
సమచతురములగు చల్లనితావులు
మహితబలంబుల మహాసామంతులు
బహువిద్యల నేర్పగుధీమంతులు
దూతాదులకును దోడగుతంత్రులు
నీతులు పతులకు నేర్పెడుమంత్రులు
నంగడిఁబుష్పము లమ్మెడిబోఁటులు
సంగతిగలవిటజనములనీటులు

గలిగి ధరిత్రిని ఘనతవహించెను
నలకాపురమునకన్నరహించెను. 23

తే. అమ్మహాపట్టణంబున కనతిదూర
మైన ఘోరాటవీమధ్యమాద్రిశిఖర
దివ్యదేశంబునను సన్నుతింప మిగుల
బట్టునైనది తాపసీ పల్లెగలదు. 24

కుచేలమహాముని మహిమ.

క. అందుఁ గుచేలుం డనుముని
నందనుఁడొక్కరుఁడు దినదినము హరిసేవా
నందంబున సకలేంద్రియ
బృందములఁ బరిత్యజించి పేర్మివహించున్. 25

తే. 'ఆత్మవత్సర్వభూతాని' యనెడుపలుకు
సత్యముగ నామహామునిచక్రవర్తి
సకలజనము నిజప్రాణసమముగాఁగఁ
దలఁచు శాంతియు దమమును దయయుఁ గలిగి. 26

సీ. ఒనరసాందీపని యొద్దఁ గృష్ణునిగూడి
చదివినాఁడు సమస్తశాస్త్రములను
జఠరాగ్నినెల్లను జల్లార్చి మిక్కిలి
వరిటినాఁడు మహోపవాసములను
జలనమొందక నిజస్వాంతంబు బిగఁబట్టి
పంచేంద్రియము లడఁగించినాఁడు
స్నానసంధ్యాద్యనుష్ఠానకర్మంబులఁ
గావించినాఁడు దీర్ఘవ్రతములు

తే. శతసహస్రపరిచ్ఛేదసంఘటితపు
రాణజీర్ణోత్తరీయంబు రమణఁదాల్చి
మానవులు కుచేలుఁ డీమహామహుఁ డనంగఁ
బేరుగాన్నాఁడు దిక్కులు పిక్కటిల్ల. 27

క. అవనీనాథ 'స్వదేశం
భువనత్రయ' మనెడిమాట పొందువడ మహా
వివిధారణ్యంబులు నిజ
భువనములుగనుండు భేదబుద్ధియు లేమిన్. 28

సీ. మొదలనెప్పుడు 'వేమూలమిదం బ్రాహ్మణ్య'
మనఁగఁ ద్రయీధర్మ మభ్యసించె
నరయ 'భార్యాసమో నాస్తి శరీరపో
షణ' యన నొకపుణ్యసతి వరించె
శ్రుతి 'నపుత్రస్య గతి ర్నాస్తి' యనియెడి
కతన నందనులఁ బెక్కండ్రఁ గనియె
'సతత మేకో నివాసః పట్టణం వా వ
నం వా' యనంగఁ గాననె యుండె

ఆ. నతిశయంబుగాఁగ స్మృతి 'నదైవం కేశ
వా త్పర' మ్మనఁగను వారిజాక్షు
పాదపంకజములు బహుసమారాధన
మాచరించె నామహామహుండు. 29

క. ఆముని నిజభార్య జన
స్తోమంబులు పొగడఁదగిన సుందరసుగుణో
ద్దామత నాయమసందఱు
వామాక్షియనంగఁ దనరు వసుధాధీశా. 30

కుచేలుఁ డిరువదియేడ్వురు సుతులఁ బడయుట.

తే. ఆపతివ్రత పెనిమిటి ననుసరించి
సులభమున నిర్వదేడ్గుర సుతులఁ గనియెఁ
బేదతనమునకే కాదె పెక్కులైన
బిడ్డల నొసంగు విధి యెంత దొడ్డతనము. 31

క. కడుసంతతి నెఱయుటకై
కొడుకులఁ గలిగించెఁ గాక కోమలికిని నీ
పుడమిని దద్బ్రాహ్మణుఁడే
యెడలను భోగేచ్ఛ సేయఁ డింతులయందున్. 32

క. విసువక యడవులరాలిన
కసవుల ధాన్యములఁ దనకు గ్రాసంబులుగా
వసు దేవసుతునిగొలుచుచుఁ
బసిబిడ్డలు నాలు నతఁడు బ్రదుకు నరేంద్రా. 33

చ. పిడికెఁడు దూసరొడ్లు కడుఁ బేర్చి దినంబును నేఱి తెచ్చియా
పడఁతికిఁదద్విభుండొసఁగ బ్రాహ్మణియున్ బచనంబుచేసియే
ర్పడ మఱి యంతలో నతిథిభాగము దీసి లతాంగి భర్తకుం
గుడువఁగ బెట్టిభర్తఁగొను కోమలి సంతతి దాను బంక్తులన్.

తే. జగతినావిప్రవరుఁ డయాచకుఁడు గాన
నింటిలోపల ధాన్యంబు లెపుడు లేవు
కోమలికిఁ బూటపూటకుఁ గుడువఁ గూటి
బిడ్డలను నేగతిని మట్టు పెట్టవచ్చు. 35

దారిద్ర్యముచేఁ బీడితుఁ డవుట.

సీ. సన్నంపునార లాచ్ఛాదించుటయె కాని
తొడుగఁగోకలు లేవు బుడుతలకును

పసినాఁడఁ గట్టినపాలపూసలె కాని
పెట్ట సొమ్ములు లేవు బిడ్డలకును
బిడికెఁడు బియ్యంబు పేదగంజియె కాని
త్రాఁగఁ బాలును లేవు తనయులకును
దట్టంబులైనపత్త్రిపుటంబు లే కాని
కుడువఁగిన్నెలు లేవు కొడుకులకును
తే. నిరుగుపొరుగునవారల యిండ్ల నెల్ల
వివిధమార్గంబులను సిరు ల్విజృంభింపఁగఁ
గుడిచికట్టెడు శిశువుల గోము లరసి
తల్లి యెట్లోర్చుఁ దన పేదతనమునకును. 36
క. బిడ్డల పేదఱికంబున
కడ్డంబై పెంచుకొనుచు నధిపునకును మాఁ
ఱొడ్డక సద్గుణగావున
నోడ్డారము సేయ కెలమి నుండెఁ దృపాలా. 37
ఆ. కలిమి గలుగుపట్లఁ గాంతునకును బ్రియం
బొనరఁ జేయవచ్చు నుచితవృత్తిఁ
బేదతనమునందుఁ జెలిమిటి మనసురాఁ
దిరుగ నేర్చినదియె గరిత యనఘ. 38
సీ. పొరుగుపిల్లలతోడి పుడుడున కేమైన
నాటలకిమ్మన్న నాలసించుఁ
బప్పుబెల్లములకై బ్రతిమాలియేడ్చుచుఁ
గొంగుఁబట్టిడ్చినఁ గుస్తరించుఁ
బాలువెన్నలకుఁగాఁ బాిమిడివడిఁబోరఁ
జన్నిచ్చి కౌఁగిట సంగ్రహించుఁ

బోగు లుంగరము లీ ప్రొద్దుటఁగావలెనన్న
మాపు దేపని పలుమాఱు బొంకు
తే. గలిమి లేము లెఱుంగక గడుసువఁగల
బిడ్డలింపైనవస్తువు లడ్డులేక
కొంటెతనమునఁ దెమ్మంచుఁ గోరగింపఁ
దల్లి యేమియుఁ ననలేక తల్లడించె. 39

క. ఈరీతిని శిశువులు దనుఁ
బోరాడిన మగని దూఱఁబోవక పలుమా
ఱారామామణి దినములు
పోరామిని గడపు సాటి పోటులుమెచ్చఁగ. 40

భార్య పతిని కృష్ణునియొద్దకుఁ బో వేఁడుట.

వ. ఇట్లత్యంత ఘోరంబయిన దారిద్ర్యచింతాభరంబున సంసారపారావారంబు దరియింపఁజాలక, సుతులతోఁ బోరాడుచుం దత్కాంతారత్నంబు సతతదయాస్వాంతుండును, సకలసద్గుణవంతుండును, నయిన తనకాంతునిం గదిసి యేకాంతంబున నిట్లనియె. 41

సీ. జిహ్వాత్వగాదిసుస్థిరతరదుష్టేంద్రి
యానీకము లుదియఁగఁ బట్టి
మదమత్సరములు కామంబులోభం బను
గురుతరాంతర్విపక్షుల నడంచి
స్నానంబు సంధ్యయు జపము హోమంబును
మొదలైనసత్కర్మములు గ్రహించి
పర్ణతోయానిలభక్షణంబులుచేసి
కాననంబున నెల్లకాల ముండి

తే. తనువు నిజశల్యశక్తిమాత్రముగ నిల్పి
శ్రీహరిధ్యాన మెప్పుడుం జేయుచుండు
నతిశయంబుగ దారసుతాదులందుఁ
దగుల నేరదు నీదు డెందము మహాత్మ. 42

తే. స్వామి మీ రెన్నటికి నయాచకుల రగుట
యాచకులు గాక యుండుట నాత్మఁ దెలియు
నైనఁ గక్కూర్తిమాట దా నాడుకొనెద
నరయు మీ మన్ననలఁ గుచేలాగ్రగణ్య. 43

క. యాదవవల్లభుఁడును మీ
కాదిస్నేహితుఁ డటంచు నందఱు దెలుపన్
మోదమున విందు నెప్పుడా
శ్రీదయితుని సమ్ముఖంబుఁ జేరి మహాత్మా. 44

తే. చిన్నవాండ్రకు నేమైన సిరులు వేఁడి
తెచ్చి రక్షించుకొనుము నా దేహమెడల
నొగిలె 'సర్వేజనాస్సుఖినోభవంత'
నియెడివాక్యంబు తలపోయు నిర్మలాత్మ. 45

తే. పూర్వసఖుఁ డైన యాదవపుంగవుండు
మిమ్ముఁ బొడగన్న సిరులెల్ల మిన్నకొసఁగు
నెఱుక పిడికెఁడు ధనమన్న గుఱుతుమాట
తథ్యమౌఁ గాదె యెందైనఁ దాపసేంద్ర. 46

మ. ఘనుఁ డాకంసవిభంజనుండు త్రిజగత్కాంతుండు మోదం
బునన్, మనకుం బెక్కుసిరుల్ ఘటించుఁ గడుసమ్మానించుఁ
గా దేనిత,ద్వనజాతాక్షుని పాదపద్మములఁ బ్రేమం జూచినం

జాలదే, చనుడీ యిప్పుడు భోగమోక్షములకుఁ బాత్రుఁ
డు కృష్ణుం డిలన్. 47

క. త్రాణలుచెడ నెమ్మనుల
క్షీణించిరి బువ్వలేక చెడి బుడతలు పో
రాణికు 'లన్నంబునకును
బ్రాణమునకు లంకె' యనెడి పలుకులుమృషలే. 48

క. నెరవుగ నాఁకటి పెల్లున
సురసుర స్రుక్కెదరు మన శిశువులం జూడన్
దురితము దారిద్ర్యంబులఁ
బొరయక మనుచున్న వారె పుణ్యులు జగతిన్. 49

సీ. రూపింప నిర్మల రూపంబు వెడలించు
రక్తమాంసముల భారము లడంచు
నుద్యోగములకు నై యూహ సేరఁగనీదు
మగల కింతులకును బగలు సేయు
బహుళంబు లైనలోభంబు లుత్పాదించు
సూనృతవాక్యంబు సూఱఁబుచ్చుఁ
జాలదురాశావిచారంబు గల్పించు
మానంబు చెడఁ బ్రతిమాలిపించు
తే. నసదృశానందవనమున కగ్నికీల
యతిశయాక్రాంత చింతావిహారణభూమి
భూరి దుఃఖంబులకు నెల్లఁ బుట్టినిల్లు
ప్రజలకును లేమికంటెఁ బాపంబు గలదె. 50

మ. సరసీజాక్షునికూర్మిభక్తుఁడవు సంసారాబ్ధికి న్నావయై
దరిఁ జేర్పం గుఱియైనవాఁడు మురవిధ్వంసుండునిన్ బ్రోవఁడే

వరమృష్టాన్నసువస్త్రపీడితులమై వర్తింపఁగా నేల శ్రీ
హరి సేవించినవారికింగలవె త్రోయన్‌రానిదారిద్ర్యముల్.
వ. అనిన నవ్వధూరత్నంబునకుఁ గుచేలుం డిట్లనియె. 52

అద్దానికిఁ గుచేలుఁడు బదులు సెప్పుట.

క. తరుణీ పూర్వభవంబున
గుఱి మీఱఁగఁ జేసినంత కుడుతురు పిదపన్
నరు లీజన్మంబునఁ గడు
మురటిల్లఁగ నేల యిట్టి తోయంబులకున్. 53
శా. గర్వాంధ్యంబున మత్తుఁడెంతయు వృథా కాంక్షన్ బ్రవర్తిం
చుగా, కుర్వన్ దాను స్వతంత్రుఁడే మనుపఁ గర్మోపేతులా
జీవులన్, నిర్వాణుండగు శౌరి కర్త జగముల్ నిర్మింప రక్షింపఁ
గా, ‘సర్వంవిష్ణుమయం జగత్త’ నెడు శాస్త్రంబుల్ నిరర్థంబులే.
ఆ. ధనము గూర్చవలెనె తనయులకును భుక్తు
లిడెడు వాఁడు శ్రీరమేశ్వరుండు
మృగసమాజములకు మేపు నీళ్లెవ్వఁడు
వెట్టి ప్రోచు నెలమి నట్టడవుల. 55
తే. ఱాతిలోఁ గప్ప కాహార మాతతముగ
నిడెడు దైవంబు మర్త్యుల కేల మాను?
బ్రతికినన్నాళ్ళు నన్నంబు పెట్టె డిడక
‘ఆయు రన్నం ప్రయచ్ఛతి’ యనఁగ వినవె. 56
క. ఓవనిత నీకుమారులఁ
బ్రోవఁగవలె ననుచు సారెఁ బొగిలెదవు మదిన్
నీ వెవ్వత నే నెవ్వఁడు
శ్రీవరదుఁడు కర్త సకలజీవుల కెల్లన్. 57

వ. కావున 'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ మ్మను కతంబునఁ బూర్వజన్మంబునం జేసినపుణ్యపాప ఫలంబులు వెంబడి నీజీవులనంటియుండిసుఖదుఃఖంబు లనుభ వింపంజేయు. 'సదానదోషేణ భవేద్దరిద్రః' యనియును, 'ధనంప్రకర్షేణ కరోతిపుణ్య' మ్మనియును బలుక సుకృ తంబులవలన నైశ్వర్యంబును, దుష్కృతంబులవలన లేమి యు నరులకుఁ బ్రాపించు. నది ఎట్లనిన, విప్రకరార్పితంబైన విత్తంబు పదపదంబునకుఁ బాథేయం బనిపెద్దలు పలుకు దురు. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' యనుమాటలు తేఁటపడం దత్కర్మానుభవంబులు దీరిన నూర్ధ్వలోకం బున నుండి యధోలోకంబునం బడి 'జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేత' యను మాటలఁ దెలుపంబడు నుత్తమ ధర్మంబునకు మరలి తమతమజన్మాంతరకృతకర్మంబు లా ధారంబులుగాఁ బక్షికీటంబులంబోలెఁ దనువు లెత్తుదురు. 'జాతస్య మరణం ధ్రువం' అన శరీరధారులకుఁ బుట్టినప్పా డే చావునిత్యంబు, పృథివ్యప్తేజో వాయ్వాకాశమయంబు లైనయీ దేహంబు లొకరిసొమ్ములుగావు. దైవయోగం బున నుండు బోవు నట్టిదుర్దశలు మర్త్యులకుఁ బరిహరింప నెవ్వరు సమర్థు లని చెప్పి వెండియు నిట్లనియె. 58

క. మఱియుదు రెవ్వరిబిడ్డలు
మను లింతియ కాక సుతులు మఱియతిహితులే
పెరిమెను బుట్టిన పుత్త్రులు
పెరుఁగఁగశత్రులను శ్రుతులు పెక్కులు వినవే. 59

శా. చిత్రం బెన్నఁగఁ జిన్ననాఁడె తనయుల్ శిక్షానుగుణ్యుల్గ
దర్, బాత్రుల్గారతి దండకార్యములకుం బ్రాయంపువారై న
ని, ద్ధాత్రిం జుట్టములట్లు చూడవలదా తండ్రుల్తనూజాతులన్,
'బుత్త్రిం మిత్త్రి వదాచరేత్త' నుచు నే ప్రాజ్ఞుల్ శ్రుతు
ల్నాటఁగన్. 60

ఆ. సుతులమీఁది ప్రీతి చుట్టాలపైఁ బ్రేమ
మిగుల నిందుముఖుల మీఁది వలపు
ధనము మీఁది యాస ధాన్యంబుపైఁ దృష్ణ
యతిశయంబు వలన దాత్మయందు. 61

క. ఎక్కడి సుతు లెక్కడిసతు
లెక్కడి సంపదలు మాయ లిన్నియు ధర్మం
బొక్కటి నిజమని యెఱుఁగని
వెక్కరులకు సుకృతిభోగవిభవము గలదే. 62

క. ఎందఱకుఁ బుట్టి పెరిగిరొ
యెందఱకును సంభవించి యీల్గిరొ మఱి యిం
కెందఱకును జన్మింతురొ
నందను లని మిగులఁ బ్రేమ నాటఁగ నేలా. 63

ఆ. పరఁగఁగను ఋణానుబంధరూపంబులు
పసులు సుతులు హితులు భామినులును
సంతతంబు వీరి సంయోగములకు వి
యోగములకుఁ జింత నొందఁదగదు. 64

క. ఇతఁడు దరిద్రుం డగునితఁ
డతులితసంపదలఁ బొదలు నని వ్రాసిన యా

శతధృతి యమోఘలిఖితము
నితరులకును దీర్పఁదరమె యిందును నందున్. 65

క. శ్రీవనితావిభుఁ డొక్కఁడె
దైవము చర్చింప సకలతంత్రంబుల 'కే
కో విష్ణు మహాద్భూతం'
నా వినఁదగినదియె కాదె నానాస్మృతులన్. 66

ఆ. సమయ మెఱుఁగఁడు హరి సహియించు నాత్మల
ధరణి నొకని నైన మరువఁ డతని
భటులు నట్టివారె యట 'యథా రాజా త
థా ప్రజా' యనంగ ధరణి వినవె. 67

తే. తాను జేసినకర్మంబు దానె యనుభ
వింపవలయును బుట్టి తద్విధము మగుడ
నెన్నితనువులో తలిదండ్రు లెందఱైరో
వశముగా దటుదెలియ జీవులకు నెల్ల. 68

ఆ. చచ్చెఁ జచ్చె ననుచుఁ జాలఁ జింతింతురు
పుట్టెఁబుట్టె ననుచు భూమిప్రజలు
సంతసింతు రెలమి సకలజీవులకును
జావుపుట్టు వొక్కసమముగాదె. 69

సీ. మాతృగర్భముఁ జొచ్చి మానవుం డష్టమా
సంబులు సుజ్ఞానశాలియగుచుఁ
గృత మొనరించి దుష్కృతములఁబొంది త
నేకనరకములం దింకనైన
నుదయించి నపుడె యొండొకబుద్ధు లొగివాని
నయమునఁ దగిన పుణ్యము లొనర్చి

చేరెద హరినంచుఁ జింతించి నవమాస
ములు నిండ యోని నిమ్ముగ జనించి
తే. విష్ణుమాయావశంబున వివశుఁ డగుచుఁ
దొంటి బుద్ధులుచెడి యంతఁ దోడుతోడ
ననుభవించును సుఖదుఃఖమందుఁ బూర్వ
జన్మకర్మవశమున నిచ్చలు లతాంగి. 70
తే. జీర్ణకంచుకమును విసర్జించునట్టి
సర్పమునుబోలె దేహంబు సడలవిడిచి
పోయి జీవుండు మఱియొక్క బొందిఁ జొచ్చు
నేశరీరంబులకు భుక్తు లిడఁగవలయు. 71
క. తరుణులఁ బుత్రులమిత్రుల
మఱువక పోషించువాఁడు మరణం బైనన్
మఱి యుంచరు తమవారని
కరుణ యొకించుకయు లేక కాలుతురు తుదన్. 72
తే. మోసమునవంటకట్టెలమోపుపగిది
వేసటను బ్రాణి దేహంబు విడిచిపోవుఁ
దమకు వచ్చిన మోహంపుతనువు లింత
దాఁచుకొనరాదె వెడలించు దాఁకఁదడవు. 73
క. ఎన్నాళ్లకైన మర్త్యుఁడు
భిన్నుండగుఁ దానయెంత పెరిగిననైనన్
మున్నె స్మృతుల్ 'యద్దృష్టం
తన్నష్ట' మ్మనెడుమాటతథ్యముగాఁగన్. 74
క. వగఁ బొగులు దీనజనముల
ఖగగమనుఁడు ప్రోవకున్న గతి యెవ్వరిలన్

మగువ వినురాజు గొట్టఁగ
మొగసాలకు మొఱలువెట్టు మహాధులుగలరే. 75

క. ధారుణిలోన ననాథుల
కేరీతిని నైన శ్రీరమేశ్వరుఁడే యా
ధారమగు 'దుర్బలస్య బ
లంరాజా' యనెడుమాట లను నిల వినవే. 76

తే. అత్తమామలు తలిదండ్రు లన్నదమ్ము
లాలుబిడ్డలు దేహంబు లస్థిరములు
సర్వములు వ్యర్థములు మృతి సమయమునకు
ధర్మ మొకటె సహాయంబు తథ్య మబల. 77

క. కాంతలు మేనులు సతమని
వంతులతోఁ గూర్తు రఖిల వస్తువుల నరుల్
ఎంత గడించినఁ గాటికి
నెంతటివాఁడైనఁ గాటి కిందునిభాస్యా. 78

క. తీరినవేల్పుల వెజ్జులఁ
గోరఁగలే రైరి దండ్రి గుజనులపదులర్
నేరిచి బ్రదికినవారలు
నేరకచెడినట్టివారు నిజముగఁ గలరే. 79

తే. చచ్చిపోయినవారికై చాలవగల
దుఃఖపడుదురు మఱునాఁడు దొడరి చనరొ
తాము బ్రదుకుట కేది తథ్యంబు తడవ
వనిత కిందాకు మీఁదాకు వాసిగాదె. 80

క. పాత్రాపాత్రత లెఱుఁగక
ధాత్రిని యాచించి ధనము దాఁచఁగనేలా

శాత్రివుఁడు ధనము 'మాతా
పుత్త్రవిరోధాయ' యనుచుఁ బూర్వులు వలుకన్. 81

క. పూనుకొని తన ప్రయత్నము
లే నిజములు దైవఘటన లిల లేకున్నన్
మానవుఁ డొకటిఁ దలంచినఁ
దానొక్కటిఁ దలఁచుఁగాక దైవం బబలా. 82

క. కోరినను రావు మనమునఁ
గోరక యుండినను బోవు గుఱుతెఱిఁగి సిరుల్
పూరుషుల కర్మఫలముల
వారక యవి తమకుఁ దామె వచ్చుఁ బోవున్. 83

క. మన తనయు లేమి సేసిరొ
మునుపటిజన్మమున నంత మురహరుఁ డొసఁగున్
విను తథ్యం బీభవమున
వనితా నీ కింత చింత వలవదు సుమ్మా. 84

వ. అని సర్వంబునకు సర్వేశ్వరుండు గలండు ప్రజల రక్షింప నేను సమర్థుండనే యని విరక్తుండై పలికిన నతని చిత్తంబు మెత్తం జేయం జాలక వెచ్చనూర్చుచు నచ్చెలువ వెండి యు నిట్లనియె. 85

ఇటుల విరక్తుండై పలుకు కుచేలునకు భార్య బుద్ధులు సెప్పుట.

క. బలువుగ సత్కర్మంబులు
దలఁచి యొనర్పక యఫలము దైవం బిడునే?
హాలికుఁ డదనెఱిఁగి విత్తన
మిల వెదవెట్టక యె పండునే ధాన్యంబుల్. 86

ఆ. మనుజుఁ డెల్లపొద్దు మానక సేయంగ
దైవయత్నమొకటి తారసిల్లుఁ
గాక యూరకున్నఁ గలదె భుక్తమునకు
దైవమానుషములు దగ సమములు. 87

తే. పరఁగ నట్టింటనుండి నా భాగ్య మనిన
దైవ మెక్కడఁ గొనితెచ్చి తనకునిచ్చుఁ
జేయఁదగిన ప్రయత్నముల్ సేయఁజేయ
నధిప యటమీఁద వారి భాగ్యంబుకొలఁది. 88

ఆ. దేవుఁ డిచ్చుననుచు దినదిన యత్నముల్
సేయకున్న నేల సిరులుగల్గుఁ?
బళ్లెరమున నిడిన పంచభక్ష్యాన్నముల్
కుడువకున్న నెట్లు కడుపునిండు. 89

క. ఇత్తఱిఁదా సేవింపక
హత్తిన కర్మములు దైవ మలమటఁ లిడునే
యెత్తెఱఁగి నరుఁ డొనర్పక
యత్తయు నొనరించుపనుల కాఅడి గలదే. 90

క. కావున మనుజుఁడు సేయక
దేవుం డీయంగ లేఁడు తెగి యేమియు నా
నావిధ ధాన్యము లుండిన
వావిరి వండకయె రిత్త వంటక మగునే. 91

మ. ఇర వౌ నక్రముచే మహాసురునిచే నేనుంగు ప్రహ్లాదుఁడుం
బరితాపించుచు వేఁడఁగాఁ గద పరబ్రహ్మంబు వేంచేసె ని
ట్లురుసంపూర్ణ దరిద్రులౌ మనలఁ గుయ్యోయన్న రక్షించు శ్రీ
హరినిష్కాముల కేలయిచ్చు బహుళంబైనట్టియైశ్వర్యముల్.

క. భావింపఁగ సత్పురుషుల
భావం బెట్లట్లతోఁచుఁ బరమేశ్వరుఁడున్
హావిశ్రుతివచనము 'య
ద్భావంతద్భవతి' యనెడు పలుకులు వినరే. 93.

క. అడుగకయుండినఁ దగువర
మిడునే నిష్కారణంబ యీశ్వరుఁ డైనం
బుడమి న్జేయఁపు చేతులు
కుడువదు నోరనెడుమాటకును దప్పగునే. 94.

క. తొల్లిటిమునులు తపంబులు
మెల్లముగాఁ జేసి శౌరి మొనసిన పిదపన్
సల్లలితంబుగ వేఁడరె
యుల్లములకు బ్రియము లైనయుచితార్థంబుల్. 95.

తే. మీరు కృష్ణుని మెఱయ నమ్మినమహాత్ము
లతిశయంబుగ నిష్కాము లైననేమి
ప్రజలరక్షించు టెల్లను బరమధర్మ
మధిప యాచింపు సుకృతాత్ముఁ డైనహరిని. 96.

తే. దైవ మవు నీవు రక్షింప దాత వీవు
మాకు నేయర్థమును నీవలోకమునకు
'అన్యథాశరణంనాస్తి' యనెడుపల్కు
తథ్యమయ్యెను మీయందు దాపసేంద్ర. 97.

క. దైవంబె నీకు శ్రీహరి
దావలముగ నీవు మాకు దైవ మవనిలో
భావింపఁగ నిట్లగుటకు
నేవిధమున నైననన్య మెఱుఁగమధీశా. 98.

ఆ. సకల భువనములను సంరక్షణము సేయ
నీశ్వరుండె కర్త యెంచి చూడ
నమ్ము సంతసించి మన్నింప రక్షింపఁ
గర్త వీవు సకల కార్యములకు. 99

వ. అని యనేకప్రకారంబుల నీతివచనంబు లుగ్గడించి, తొల్లిటి
వారు నడుచు క్రమంబుఁ దెలిపి, ప్రజారక్షణంబు పరమ
ధర్మం బని ప్రార్థించిన. 100

—కుచేలుఁడు కృష్ణుని యొద్దకుఁ బోవ నియ్యకొనుట.—

క. 'ఆనందో బ్రహ్మ' యనెడు
మానితవచనంబు దలఁచి మానుషమున న
మ్మానిని మృదువచనములకు
మానీంద్రుఁడు సమ్మతించె మానసవీథిన్. 101

తే. ఎట్టకేలకుఁ దత్కార్య మియ్యకొనుచు
గాంచనాంబరు నెలమి సేవించుటయును
బ్రజల రక్షించుటయు మంచి పని ఘటిల్లె
తీర్థమును స్వార్థము నటంచుఁ దెలిసి యపుడు. 102

—కుచేలుఁడు గొంపోవఁ గానుక నరయుట.—

ఉ. భామినితోడ నిట్లనియెఁ బద్మదళాక్షుని గానఁ బోయెదన్
గోమలి బల్ దరిద్రులము కొంచుఁ జనన్ మన కెద్ది వస్తువా
స్వామికి నిష్టమైనయది సంగతియే చనరిత్తచేతులన్
భూమిపులొద్దకున్ సతులపొందులకున్ గురులున్నచోటికిన్.

చ. గరిమ సమస్తవస్తువులు గల్గినవా రరుదేరఁ జాలఁ బె
ద్దఱికముఁ జేసి పంపుదురు తండ్రి సుతుం డనుజన్ముఁ డైన బ

ల్పరిభవ మాచరింపుదురు భామిని పేదతికంబు దోఁచినన్
సిరి చెడిపోయి చుట్టములఁ జేరిన లాఘవ మందకుండునే.

తే. తజ్జ్ఞులు 'నతిపరిచయా దవజ్ఞత' యన
నాది 'సంతతగమనా దనాదరో భ
వతి' యనంగ నహీనార్థవాక్యనిచయ
ములను బురుషుండు పరిభవంబున వసించు. 105

క. సధనులకడకు దరిద్రుం
డథవా పోరానిపట్ల నరిగిన యేనే
విధమునఁ గైకొని చనవలె
నధికము లగువస్తువులు సితాంభోజముఖీ. 106

తే. ఎట్టకేలకు విహితుల యిండ్ల కేఁగి
పెరిమెఁ దా నూఱకుండుట పెద్దతనము
గలదె యడుగుటకంటెఁ బల్చలకఁదనము
'యాచనాంతం హి గౌరవ' మ్మన వధూటి. 107

క. రంజిలి తా మునుమున్నుగ
నంజలిపడ కిచ్చె నేని నయముగ వారున్
గొంజగ నిత్తురు క్రమ్మఱ
ముంజేయియు నాడె నేని మోఁచేయాడున్. 108

తే. కావున సమస్తసామ్రాజ్య కర్త యైన
యిందిరాధీశునకుఁ గాను కీఁగవలయుఁ
'జంద్రునకు నూలిపో' గన్న సామె తగును
గాన నేమైన మనశక్తి గలకొలంది. 109

క. కొండికలము మన కెంతటి
దండి గలుగు నధికవస్తుతతి హరి కొసఁగ న్
గొండంత దేవునకు మఱి
కొండొంతయుఁ బత్త్రి యిడెడు కుశలులు గలరే. 110

మ. పరఁగన్ సర్వనదీనదాంబువులకున్ బట్టైన వారాశికిన్
బరితుష్టంబులె మంచుబిందువులు సంపన్నాఢ్యుఁడౌ శౌరికిన్
బరిధానం బొకలాభమే యయిన నిప్పాటి న్నిరర్థంబుగా
నురువొభక్తి యనంగఁ జొప్పడుఁగదా యూహింప నిద్ధాత్రిలోన్. 111

క. అదిగావునఁ గార్యార్థము
మదనగురునికడకు నిపుడు మనమూరక పో
విదితముగా దేవెర వన
ముదితయుఁ దనవిభునివాక్యములకు నలరుచున్. 112

క. నెరవుగఁ గొన్నిదినంబులు
నిరతంబుగ నుపవసించి నివ్వరియడుకుల్
దొరకినయట్లువధూమణి
వరుని కుచేలమునముడిచి పనిచిన యంతన్. 113

కుచేలుఁ డడుకులఁ గొనిపోవుట.

క. ధరణీసురుఁ డాదినమున
హరిసేవార్థంబు గదలి యతిదూరముగా
గిరులును కానలు నదులును
బురములు గ్రామములు గడచి పోవుచు మదిలోన్. 114

తే. ఆత్మబుద్ధియె కడుసుఖం బన్నిటికిని
జెలఁగి గురుబుద్ధి కొంతవిశేష మరయఁ
బరులబుద్ధి వినాశంబు పరఁగఁ జేయు
స్త్రీలబుద్ధులు ప్రళయముల్ చిత్తగింప. 115

క. అదియె ఱేఁగియు నీరీతిని
బడపడి యాయూరి యూరి పథముల వెంటన్
బెదరక వచ్చితి నేటికి
సధనులమె ప్రయాణములకు శక్తులమె తగన్. 116

క. పుడమి విభు లెంద ఱెందఱొ
పొడగాన్పులులేక ద్వారభూములయందున్
బడిగాఁపులు పడియుండఁగ
బడుగుల కేలబ్బుఁ గంసభంజను సేవల్. 117

ఉ. ద్వారక యెంతదవ్వొ కడు దారుణమైనమహాసముద్రమే
తీరునదాఁటు డందు వసుదేవతనూజుని దివ్యమందిర
ద్వారము లెట్లుసొత్తును వృథా నను దెంచితిఁ గంసవైరి నన్
జేరికి నైననుంగొనునె చిత్తమునం గరుణించి యిత్తఱిన్.

ఆ. కల్పవృక్షమునకుఁ గదిసి కాయడిగిన
చందమునను శౌరిసమ్ముఖమునఁ
జేరి తుచ్ఛమైనసిరి వేఁడికొన నయ్యొ
నాస దోస మెఱుఁగ దనుట నిజము. 119

వ. అని, డోలాయమానమానసుండై యమ్మానివర్యుండు, తన
మానిని చేసిన యుపాయంబునకు రోయుచు, నూరూరి
తెరువులెఱుంగక, యెడనెడల నెదురైనజనుల నడుగుచు,

నెడారులైన దుర్గమస్థలంబుల మార్గంబులు గడచి, యర ణ్యంబులుసొచ్చి, నడుచుచుం, గంటకంబులు పాదంబులు నాఁటినం దీయనేరక గొంటువడి కుంటుచుఁ, జండతరంబు లైన వేసవియెండలబెండువడి తరుషండంబుల నీడల నిలు చుచు, నిరాహారుండై నిశీథసమయంబులఁ, బురంబులో పలికరిగి, జనంబులసందడింబడనొల్లక, గుడిగుండంబుల పంచల నొదిగి లజ్జించుచు, మున్నుమున్న గా లేచి నడు చుచు, ముందటియోజనంబు లెన్నుచుఁ, బెక్కుదాఁటిన దినంబులు లెక్కపెట్టుచుఁ, దట్టుపడి యల్లనల్లనఁ జనియెను.

వ. అని చెప్పిన. 121

క. గుఱుతుగ విని యభిమన్యుని
వరతనయుఁడు శుకునిఁ జూచి వాంఛలు నిగుడన్
బరికింపఁగ నెట్లయ్యెడుఁ
దరువాతిమహాకథావిధానం బనినన్. 122

## ఆశ్వాసాంతము.

మ. కురువంశాంబుధిబాడబాగ్ని హరి యక్రూరాంబరీషాదిస
త్పురుషాసీకశరణ్య గోపకనిజాంభోజేక్షణా మన్మథా
పరిహాసీకృతపద్మసంభవదృఢప్రజ్ఞానసముల్లాస శ్రీ
తరుణీనేత్రచకోరశీతకర దైత్యధ్వంస కంసాంతకా. 123

క. కాలయవనసాళ్వశిశు
పాలజరాసంధకంసబలభంజన కు
బ్జాలలనాదిమనోహర
మాలాకారప్రసూనమాల్యాభరణా. 124

తోటకము. కరిపోషణ నిర్జితకంజభవా
మురళీరవగానవిమోహరవా
వరవర్ణితయాదవవంశభవా
గురుధైర్యసురక్షితగోపధవా. 125

గద్య. ఇది శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధసరసకవితా
ధురంధర సకలకవిమిత్ర యల్లనామాత్యపుత్త్ర సకలసద్గుణ
విధేయ గట్టుప్రభునామధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యా
నం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము
సమాప్తము.

శ్రీ ర స్తు.

# ద్వితీయాశ్వాసము.



రుక్మిణీమనోహర
కారుణ్యసుధాసముద్ర కంసమథన య
క్రూరాంబరీషసుజనా
క్రూర చిదానంద కృష్ణ గోప ముకుందా. 1

వ. దేవా, యవధరింపుమని పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. అంత శ్రీహరిచరణస్మరణశీలుండగు కుచేలుం డరుగుచు, 2

క. కనుఁగొనియె మీనకర్కట
కనదురుకవిముఖ్యజంతుగర్వోల్లాసిన్
ఘనకల్లోలవిభాసిన్
వనరాశిన్ దీవ్రలవణవారివిలాసిన్. 3

వ. కాంచి తదీయమహిమాభిరామతకు మనంబున వెఱఁగుపడి, యజ్జలధికర్ణధారకునిం బ్రార్థించి యచ్చట. 4

మ. బలసంరంభముతో సువర్ణఘటితప్రాసాదయూథంబుతో
బలభద్రాదికయాదవప్రభులతో భద్రేభయూథంబుతోఁ
గలకంఠీనిచయంబుతో బహుతురంగశ్రేణితో సంతతో
జ్జ్వలమైయొప్పెడుద్వారకానగరమొప్పంజూచిహర్షించుచున్.

కుచేలుండు ద్వారకను జేరుట.

. వాఁకిటికావలివారలఁ
గైకొని యాశీర్వదించి కదలి కుచేలుం
డాకాంక్షఁ జొచ్చి జనముల
మూఁకలసందడిన యొదిఁగి మూఁగినయంతన్. 6
తే. గాలిఁబోయెడి పరుగాకుగతిఁ గరంబు
తూలఁబోయెడి నెమ్మేనితోడఁ జనుచు
విప్రవర్యుండు కన్నుల విందుగాఁగ
వీక్షణముఁజేసె రుక్మిణీవిభునిపురము. 7

శ్రీకృష్ణుని సౌధవర్ణనము.

. ఏచెంతఁజూచిన నిందుబింబాస్యల
గములునటించు రంగస్థలంబు
లెచ్చోటికేఁగిన నెలమి నేణీమద
కాశ్మీరసిక్తశృంగాటకంబు
లేగృహం బరసిన హేమనిర్మలరత్న
భూషణోజ్జ్వలలైన పుణ్యసాధ్వు
లేవాడఁజొచ్చిన నిక్షురంభాస్తంభ
భూరిపల్లవగుచ్ఛతోరణంబు
తే. లెచటఁజూచినఁ గేలీమహీధరములు
నెందుఁబోయినఁ దుంగభద్రేభఘటలు
ప్రస్తుతింపంగశక్యమె బ్రహ్మకైనఁ
దన్మహారాజధాని సౌందర్యమహిమ. 8
తే. ఏమిచెప్పుదునిఁక నామహీసురునకుఁ
ద్రోవనడిచినబడలికల్ దూరమయ్యె

దప్పి యాఁకలియును మానెఁ దాప ముడిగె
తనివి సంధిల్లెఁ దత్పురీదర్శనమున. 9

వ. మఱియు, నతండు శృంగారంబులుగాఁ బ్రతిగృహాంగణంబులయందుఁ బెట్టిన గట్టిము త్తియంబుల రంగవల్లులఁ గనుంగొనుచు, నెడనెడలఁ దుటుములు గట్టి దేవకిపట్టిని గనుంగొనఁ గదలుపుడమివిభులసందడింబడి యొదిఁగిలంబడుచుఁ, గీడు మేలు గలిగి మదకీలాలంబులు దొఱుఁగ విడిచి, యాలానంబులఁ గట్టునంబడక పట్టణంబునం దిరుగు మదశుండాలంబులకు వెఱచి యుఱుకుచు, గేహంబుల వెడలఁదిగిచి, సాహిణుల మోహరించి యదల్చుచు, గిలుకలు గదల్చి తగువారుకోలలు వైచిన వీథివీథులఁ జక్కన్ వాహనంబుగ నటించు వాహనంబుల మోహరంబులఁ జూచుచుఁ, జేడియలతోఁ గృష్ణుండు క్రీడించు తెఱంగులు వాడవాడల గోడల మేడల వ్రాసిన చిత్రరూపంబులకు విచిత్రంబు నొందుచు, వెండియు ముకుందుండును గంసజరాసంధశిశుపాలసాళ్వయవనాదుల జయించిన మంచిగీతంబుల వినుచు బంచమస్వరంబులచే మెఱయించు విపంచీనాదంబుల వినుచు, నంచెలంచెల రాయంచల వడువున విహరించు చంచలాక్షుల వీక్షించుచు, భేరీమృదంగశంఖకాహళనాదంబులకుఁ బ్రమోదించుచుఁ, జనిచని యతిదూరంబున శౌరిమందిరద్వారంబుఁ గనియె నప్పుడు. 1

ఉ. అచ్చటివారణంబులుహయంబులుభృత్యులుశౌరిఁగానఁగ
వచ్చిన రాజసంఘములు వారిజనేత్రల తండతండముల్

పెచ్చుపెరింగియుండెఁ దల పేను తల న్వేసఁ జొచ్చినట్లుగాఁ
బొచ్చెములేక పైనిసుక పోసినరాలనియంతసందడిన్. 11

తే. అట్టిబలుదొడ్డసందడి నధిగమించి
సూచి యెక్కింతయును జోరఁ జోటు లేక
యెట్టకేలకుఁ బెనుగొందు లీఁగియీఁగి
చేరె నారాజమందిరసీమయందు. 12

క. తిరుమణి తిరుచూర్ణగదా
ధరులను ఘనశంఖచక్రధారణులను శ్రీ
కరలాంఛనఘనకనకాం
బరులను దద్వారదేశపాలురఁ గనియెన్. 13

తే. కాంచి వైకుంఠదివ్యలోకమున నున్న
జయవిజయులొక్కొ వీరు నిస్సంశయముగఁ
గాక యుండిన మాయయ్యగారు లైన
వైష్ణవోత్తములెవ్వరు వసుధననుచు. 14

సీ. ఎలమినూకలుగట్టి నెడమించుకయు లేక
చినిఁగినకడుప్రాఁతచేలతోడఁ
బెనఁగొన్న యాఁకటిపెల్లునఁ గడుడస్సి
మిక్కిలికృశమైన మేనితోడఁ
గఱకేశంబులు గడ్డంబుమీసము
లెరివిగట్టిన బలుతిరులతోడ
మాననిదీర్ఘమై మార్గఖేదంబునఁ
బ్రకటితంబగుబడలికలతోడ

తే. దాహమొదవినవదనపద్మంబుతోడ
లా వెడలి వెలుపడినశల్యములతోడ

జనులకెవ్వరికినిఁజూడ ననువులేక
యెదుటనిలుచుండి వారల కిట్టు లనియె. 15

—॥ కుచేలుండు కృష్ణునిమందిరముఁ జేరవేఁడుట. ॥—

క. ఆశీర్వాదంబులు మీ
కోసుజనశ్రేష్ఠులార యుత్తములారా
వాసిగ శ్రీవల్లభునకు
దాసులరైనార లెంత ధన్యులో జగతిన్. 16

తే. శౌరిసామీప్యపదములు సంగ్రహించి
విష్ణుసాయుజ్యములచేత వెలసినారు
బ్రహ్మనారదులైన మీపాటివారు
గారు శ్రీహరిపాదకైంకర్యములను. 17

తే. మిమ్ముఁ గనుఁగొన్నయప్పుడే మిగుల హరిని
జూచినటువలెనయ్యె నా చూడ్కులకును
నెంత పుణ్యంబుఁ జేసితి నీభవమున
సకలకార్యంబు లిఁక మాకు సఫల మగును. 18

ఆ. చిన్నప్రాయమునను శ్రీకృష్ణుఁడును నేను
గూడి యాడి చదువుకొన్నవాఁడ
నెఱుఁగు మున్ను నన్ను నీశ్వరుఁడు గుచేలుఁ
డనెడిపేరివాఁడ నవనిసురుఁడ. 19

తే. కర్ణధారకువలనఁ జక్కఁగఁ బయోధి
దాఁటి తీరంబుఁ జేరుచందమున మీయ
పారకరుణావిశేష మాధారముగను
శౌరిఁ గనియెద నాపద ల్బాలఁగడచి. 20

క. నేవచ్చిన యీరాకలు
దేవకినందనున కిపుడు దెలుపఁగ వలయున్
మీవంటిఘనులవలనను
శ్రీవల్లభు సమ్ముఖంబుఁ జేరఁగవచ్చున్. 21

వ. అని ద్వారపాలకులం బ్రార్థించుధరణీబృందారకుని వికృత రూపంబుఁ గనుంగొని తత్పార్శ్వంబుల నున్నజనంబులు పరిహాసంబునకు నిట్లనిరి. 22

తే. సకలసామ్రాజ్యవిభుఁ డైన శౌరియేడఁ
గానుచేయని వృద్ధమర్కటమువంటి
నీచ బాపఁడ నీవేడ నిన్నుఁ జూడ
నతనిఁ జూడఁగఁ గరిమశకాంతరంబు. 23

క. గర్వాంధవిప్రుఁ డెక్కడి
నిర్వాణము లవనిపతులు నిరతము 'దుష్ట
స్సర్వత్ర పూజ్యతే' యన
నుర్విన్ బూటకులుగాన నొప్పరు నృపతుల్. 24

ఆ. చిన్ననాఁడు నీవు చేసినయిష్టంబు
మఱువకున్నవాఁడె మాధవుండు
సిరిగలతనితోడిచెలిమి వర్ధిలుఁగాక
పేదవారిమీఁదఁ బ్రేమ గలదె. 25

చ. ఎఱుఁగరు దొడ్డకొంచెములు నెంతటిమిత్త్రులనైన నాత్మమం
దిరములు చేరనీరు కడుతెంపునఁజేసిన మేలు లప్పుడే
మఱతురు తండ్రి నన్నలఁ గుమారులఁ ద్రుంతురు రాజ్య
కాంక్షచేఁ,గరుణ యొకింత లేనిమహికాంక్షుల రాజుల నమ్మ
వచ్చునే. 26

క. సత్యవిహీనులు నిత్యా
నిత్యవివేకరహితు లవనీపతులు మహా
హాత్యాదికర్మదుర్మదు
లత్యుగ్రులు నృపులు సూడ నాసక్తు లిలన్.

క. తనవారినెఱుఁగ రెవ్వరి
నెనయరు వాక్యములు కడువిహీనస్వరముల్
వినిచెవుడును గనిగ్రుడ్డియు
జననాథుల కెల్ల నివియు సహజగుణంబుల్.

ఆ. మోదమునను 'వస్త్రముఖ్యం త్వలంకార'
మనెడునీతివాక్య మరయ మంచి
కోకలైన లేవు కువలయాధీశుల
కొలువుకూటములను మెలఁగు టెట్లు.

ఆ. కండ మెండు లేదు కాయంబునను జూడ
వస్త్రహీనుఁడవు సువస్తువులగు
భూషణములు లేవు భూమిభర్తల నెట్టు
లవనిసుర స్పృశించెదవు క్రమమున.

క. కులహీనత హీనతయగు
నిల జనులకు వస్త్రహైన్యమే హీనతగాఁ
గలుగవలె న్మృభ్రము లగు
వలువలు పరిపాటి యెంతవారికినైనన్.

క. కోకలు డబ్బులు సొమ్ములు
జోకలు గలయట్టివరులఁ జూచిన సభకున్
గైకొని యిటు రమ్మందురు
చీకొట్టుదు రందఱును గుచేలుండైనన్.

ఆ. ఇంటిదీపమనుచు నిగిలించికొని ముద్దు
పెట్టుకొన్న నోరు బిట్టుగాలు
నృపులసమ్ముఖంబు నెనరులెంచుచుఁ జను
వాఁడు మిగులఁబరిభవంబు నొందు. 33

సీ. ధరణి 'శరీర మాద్యం ఖలు ధర్మసా
ధన' మనురీతి శాస్త్రముఁ దలంచి
తనువు పోషణచేసికొని యర్థ మార్జించి
యతిథిపూజలు దేవతార్చనములు
స్నానంబు సంధ్యయు జపము హోమంబును
గావించి పుణ్య మగ్గలము గాఁగఁ
గూడఁ బెట్టుచు 'గులకోటింసముద్ధరే
త్త'నఁ దనవారితోఁ దనరు సుఖము
తే. లనుభవింపంగవలెఁగాక యనుదినంబు
వ్రతములంచును వివిధోపవాసములను
దోలు నస్థులు వ్రేలాడఁ దూలితూలి
దేహ మెడలిన నేమి సాధింపఁ గలవు. 34

చ. నయముగ మేనుపెంచి నరనాథునిగొల్చి సమస్తభాగ్యముల్
ప్రియమునఁగూడఁబెట్టి కడు పేర్మి వహింపకయిట్టులుండినన్
జయమగునే మనంబునకు సంతతిధర్మము లాచరింప ని
శ్చయముగ 'దుఃఖితే మనసి సర్వమసహ్య' మనం దలంపవే

క. ద్రవిళేశుఁ డితఁడె మాగధ
కువలయవిభుఁ డితఁడె వీఁడె కొంకణపతి శ్రీ
ధవుని గనలేక తిరిగెద
రెవని న్నొచ్చెదవు నీవు నిందఱిలోనన్. 36

తే. ఎంతయోగ్యుఁడవైన నీ విట్టు లలిగి
పోవఁ బొసఁగంగఁ జూతురే భూమిపతులు
దానమునఁ దొల్లి 'వేదపాఠో నిరర్థ
క' యనుమాటలు నిక్కముల్ గావె తలఁప. 37

తే. పేదబాపఁడ నీవంటిబీదలకును
నశమె పొడఁగన శౌరి షోడశసహస్ర
భామినులతోడ లోపలిభవనమున మ
హోన్నతైశ్వర్యవంతుఁ డైయున్నవాఁడు. 38

క. తమతమ మనవులు దొరకక
నెమకుచుఁ దిరుగుదురు చాల నృపవర్యులు బల్
సముఖములంట సులభము లే
భ్రిమలంబడ కరుగవయ్య బాపఁడ యింకన్. 39

వ. అనిపలికెడు పామరజనంబులవచనంబులకు దరహాసంబుల
నెఱపుచుఁ బరమదయాపరులును, శాంతాకారులును గ్రోధ
కోపవిదూరులును, బరోపకారులునునగు ద్వారపాలకులు
వారికలకలంబులు వారించి యిట్లనిరి. 40

క. గర్వముడిగి యెట్లుండిన
నిర్వాణుల కేమి యొగ్గు నీతిగ 'విద్వాన్
సర్వత్ర పూజ్యతే' యన
నుర్వి న్విద్యాధికుండు యోగ్యుఁడు సభలన్. 41

తే. రమణ 'వివిధాని తోయపూర్ణాని' యనఁగ
ఘననదీస్నానములయందుఁ గలదె ముక్తి
పరఁగ నిటువంటిసుజ్ఞానపురుషవరులఁ
బూజ లొనరించుకంటెను బుణ్య మెద్ది. 42

క. నారలె చీరలు తులసీ
హారంబులె భూషణములు ననవరతసదా
చారమె జన ముర్వీబృం
దారకులకుఁ గాక రిత్త దంభము లేలా. 43

తే. కడఁగి శపియింప శాపంబుఁ గ్రమ్మఱింప
విప్రుఁడె సమర్థుఁ డట జగద్విదితముగను
బ్రాహ్మణాధీనములు మహీపతులరాజ్య
భోగవైభవములు సారెఁ బొగడ నేల. 44

తే. పుడమిలో నెట్లయుండినఁ బూజనీయుఁ
డఖిలధర్మార్థనిర్ణయుం డరసి చూడ
బ్రాహ్మణుఁడు క్షత్రవైశ్యశూద్రాదివివిధ
వర్ణములకెల్ల గురువు దేవరయుఁ గాఁడె. 45

ఆ. దేవుఁ డనఁగ నెట్టి తెఱఁగువాఁ డెఱుఁగము
పుడమికెల్ల వేల్పు భూసురుఁడె వి
నోదముగను 'బ్రాహ్మణో మమ దేవతా'
యనెడుమాట శౌరి యాడెఁ దొల్లి. 46

మ. తిరిపెంబెత్తినవస్త్రహీనుఁ డయినన్ దీనత్వమున్బొందినన్
ధరలోనన్ మఱి యెట్టులుండినమహాధన్యుండు గాకల్గుఁడే
సరసీసంభవ సంభవాననమునన్ జన్మించెఁ బూర్వంబు సు
స్థిరతం బుత్రుఁడె 'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీ' త్తంచుఁ
జాటెన్ శ్రుతుల్. 47

ఆ. నుతులు సేయు 'బ్రాహ్మణో భోజనప్రియ'
యనఁగ విప్రవర్యుఁ డారగించి

తృప్తిఁ బొందెనేని దేవుఁ డాయన్నప్ర
దాత కొసఁగు నధికతరశుభములు. 4

ఆ. జలజనయనుఁ డాది సకలదేవతలకు
ముఖము లవనిసురులు మొదలుసూడ
నిఖిలకర్మములకు నిర్జరుల్ బ్రాహ్మణ
భోజనములఁ దృప్తిఁ బొందవలయు. 4

ఆ. బ్రహ్మకులునితిట్టు బ్రహ్మాస్త్ర మమ్మపో
త్తమునిదీవనలు సుధారసములు
వివిధశాస్త్రములను 'విప్రవాక్యంజనా
ర్దన' యనంగమాట తప్పు నగునె. 50

ఆ. తాపసులకు నేల ధవళవస్త్రంబులు
భూమిసురులకేల భూషణములు
విప్రవరులకేల వివిధాన్నపానాది
భక్షణములు భోగపగులె ద్విజులు. 51

ఆ. పూర్వసఖుఁడుగానఁ బురుషోత్తముని జూడ
వచ్చినాఁడు గాని వాంఛనితఁడు
సంశయింపనేల సకలదేశావనీ
పతులు భృత్యసములు బ్రాహ్మణులకు. 52

వ. అని సకలసద్గుణ విభాసురులగు భూసురుల ప్రభావంబులు దెలిపి, తద్ద్వారపాలకులు, కుచేలు నచ్చట నునిచి, పచ్చని కోకవాని కీముచ్చట లెఱిఁగించువారైచని, బహువీరభట పాలితంబులైన మహాద్వారంబులు డెబ్బదిరెండునుంగడచి, యచ్చటఁ బారిఘాంగనాశతంబులు వేత్రహస్తతఁ బెక్కులు గాచియున్న లోపలివాఁకిటనిలిచి, శౌరికిఁ దమరాక యెఱిం

గించి, తదనుజ్ఞాతుండై చొచ్చి, తారకాగణపరివృతుండైన
రాకాసుధాకరుంబోలెం గాంతాజనమధ్యంబుననున్న కం
తుజనకుం గనుంగొని. 53

మ. వనజాతాయతలోచనాయ మురవిధ్వంసాయ కంసాదిదు
ర్జనుజాధీశవిభంజనాయ మురళీమాధుర్యగానామృత
స్వనసంపూర్ణదిగంతరాయ బహుసంసారాయనారాయణా
యనమోయంచుఁ బ్రణామముల్సలిపి బ్రహ్మానందసంపూర్ణుఁడై.

తే. అవధరింపుము బ్రహ్మకులాగ్రగణ్యుఁ
డొకఁడు తలవాఁకిటికి వచ్చి యున్నవాఁడు
ఇచ్చఁదనరాక మీకెఱింగింపుఁడనుచు
మసలి ప్రార్థించుచున్నాఁడు మమ్ము నేఁడు. 55

క. తనపేరు కుచేలుండఁట
జనసన్నుత మీకుఁ బూర్వసఖుఁడఁట మీతో
నొనగూడి చదివినాఁడఁట
మునుమీర లెఱుంగుదురఁట మురకంసారీ. 56

తే. విన్నవార్తలు మీతోడ విన్నవింప
నిటకువచ్చితి మింకమా కేమిబుద్ధి
సాధుజనరక్షణములు మీ సహజగుణము
లనఘ మీచిత్తమతనిభాగ్యము ముకుంద. 57

వ. అని బహుప్రకారంబులం బలుకఁ, గరుణారసార్ద్రిచిత్తుం
డై పరమేశ్వరుండు పూర్వస్నేహంబుఁ దలంచి, యాకుచే
లునిం దోడ్కొనిరండు పొండని తద్ద్వారపాలకులం బనిచిన,
శీఘ్రింబునం జని. 58

తే. అల కుచేలునిపాదాబ్జములకు మ్రొక్కి
యెంత పుణ్యుండవయ్య మునీంద్రచంద్ర
స్వామి మీరాకవిని చాలసంభ్రమమునఁ
బిలువుఁడనియెను మమ్మును బ్రియమెలర్ప. 5

క. నీవార్తఁ దెలిపినప్పుడె
భావమునఁ గృపావివేకపద్ధతి మెఱయం
గా వినెఁ బరాకు సేయక
శ్రీవల్లభుఁ డాననమునఁ జిఱునవ్వొలయన్. 6

ఆ. తరణిరాకకలరు సరసిజంబునుబోలెఁ
జంద్రురాక కెలమి సంతసిల్లు
ధరఁ జకోరమట్లు ధారుణీసుర నీదు
రాక కలరె వింతలేక శౌరి. 6

క. ఎంతటిప్రియుఁడవో హరికిని
నెంతటిభక్తుఁడవో కాక యెందఱో ధరణీ
కాంతులు తలవాఁకిటఁబడి
సంతాపించెదరు శౌరి సన్నిధి లేకన్. 6

క. చనుఁడని పలికినవిప్రుఁడు
కనుఁగవ నానందబాష్పకణములు దొఱఁగన్
దనకిన్నాళ్లకు సెలవుగఁ
గనఁగలిగెన్ శౌరిపాదకంజము లనుచున్. 6

కుచేలుండు కృష్ణుని జూచుట.

వ. అంతరంగంబున నత్యంతసంతోషాక్రాంతుఁడై, కరిఘట
వీరభట సముత్కటంబైన యమ్మహాద్వారంబులు డెబ్బదిరెఁ
డునుం గడచి, మఱియుఁ బెక్కువాఁకిళ్లనుం దూరి, యెద

నెడఁగడుబెడంగులై చూడందగిన మేడలుంగడచి, పటికం
పుగోడలును, బగడంపు కంబంబులును, నీలంబుల జాలకం
బులును, వజ్రంబుల కవాటంబులును, వైడూర్యంబుల ద్వా
రబంధంబులును, బచ్చలతోరణంబులును, బద్మరాగంబుల
వాచూరులును, బుష్యరాగంబుల వేదికలును, ముత్తియం
బులరంగవల్లులును, గోమేధికంబుల సోపానయూథంబులు
ను, కృష్ణాగరుకాండంబుల ధూపంబులును, నెల్ల దేశంబులం
జల్లిన ఘుగఘుగమని వెలయుమృగనాభిరసంబుల సౌరభంబు
లును, విచిత్రవిక్రమకథాక్రమంబు నిగుడఁజిత్రించిన చిత్ర
రూపంబును, హరిషోడశసహస్రాంగనాకలరవంబును గలిగి
మణిమయానేకచంద్రశాలావిరాజమానశాతకుంభాంకితం
బును నగునభ్యంతరమందిరంబుం బ్రవేశించి యచ్చట.

సీ. విద్రుమోష్ఠియొకర్తు వింజామరలువీవ
లలనయొకర్తు కాలాంజిఁబూనఁ
గోకస్తనియొకర్తె యాకుఁజుట్టియొసంగఁ
గలకంఠియొకతె బాగంబులీఁగఁ
గమలాక్షియొకతె బంగారుగిండివహింపఁ
దొయ్యలియొకతె పాదుకలుపట్ట
నెలఁతుకయొక్కతె నిలువుటద్దముఁజూప
సకియయొకర్తు హెచ్చరికసేయ

తే. రుక్మిణీపుణ్యసాధ్వియూరువులమీఁద
మస్తకముఁజేర్చి సత్యభామావధూటి
తొడలపైఁ బాదములుసాఁచి కడుఁబ్రియమునఁ
బవ్వళించిన యిందిరాభర్తఁ గాంచె. 65

తే. పెన్నిధానంబుఁ బొడగన్న పేదవోలె
దప్పిగొని నీరుఁగనిన బీదయునుబోలె
వఱదఁబోవుచుఁదరిఁగన్న పిఱికివోలె
హర్షమునుబొందె మిగుల నయ్యవనిసురుఁడు. 6

— కుచేలునిం జూచి కృష్ణుండు సన్మానించుట. —

వ. ఇట్లు వచ్చిన యాకుచేలునింజూచి, శౌరి లేచి, కాంతదవ్వ
మధ్యంబున నెదుర్కొని, కడుఁబ్రియంబున నమస్కరిం
కుశలంబడిగి, యాలింగనంబుచేసి, కూర్చుండనియమించి
శరీరపరితాపనివారణంబుగాఁ దన మృదుకరంబుల నత
దేహంబునివిరి, కుంకుమాగరుసమంచితంబైన మంచిగ
ధంబు మృగమదమిళితంబుగా నతనిశరీరంబున నలంది
యక్షతంబు లిడి సువర్ణరజతంబులైన మంచి దుకూ
వస్త్రంబులుఁగట్టించి ధూపదీపంబు లొసంగి, నీరాజనంబ
లిచ్చి, సకలద్రవ్యసంపన్నంబులైన యన్నంబును, భక్ష
భోజ్యలేహ్యచోష్యపానీయంబులు మొదలైన ద్రవ్యంబ
లును దెప్పించి కుడువంబెట్టించి, కర్పూరమిళితంబై
తాంబూలంబు నొసంగి, వధూజనసభామధ్యంబున నత
నిజశయ్యాతలంబునఁ గూర్చుండ నియమించి, వింజామర
బులు విసరుచు మార్గఖేదపరిహారంబుగా నడుగు లొత్త
దొడంగిన. 6

శా. శ్రీలక్ష్మీపతిసమ్ముఖంబున మునిశ్రేష్ఠుండు నిష్కాముఁడుఁ
జేలున్నట్టులయూరకుండె నతఁ డుత్ప్రేక్షింప నట్లాఁ గద
హాలిక్ బూటకముల్ వహింప రతిదివ్యజ్ఞానవంతు ల్బుధుఁ
'బాలోన్మత్తపిశాచవత్త'నుచుఁజెప్పన్ శాస్త్రముల్ మిథ్య

తే. భావమా భ్రమరమునకు భ్రమసినట్టి
కీటకమువోలె హరియందుఁ గీలుకొల్పి
మాధవధ్యానమున మేను మఱచెఁగాక
యిలఁ బతులవేఁడుకొననివా రెందుఁగలరు. 69

ఆ. కుంభగతములైన గొప్పదీపంబుల
కరణి మానసమును వరుస నింద్రి
యములఁ జొనిపి యాదవాధీశ్వరునియందె
తనువుచేష్టలెల్లఁ దలఁపకతఁడు. 70

వ. మఱియును. 71

కుచేలుఁ డానందవారిధిని మునుఁగుట.

సీ. మురవైరిశృంగారమూర్తి విలోకించి
నయనేంద్రియంబు నానందమొందఁ
గమలాక్షువనమాలికాసౌరభంబుల
ఘ్రాణేంద్రియము దృప్తిఁ గైకొనంగ
మధువిరోధివిలాసమధురవాక్యంబుల
శ్రోత్రేంద్రియము సౌఖ్యసోలి యాడ
జలజాక్షుమృదుహస్తసంస్పర్శనమునఁ ద్వ
గింద్రియంబునుఁ గడు నింపుఁబూనఁ

తే. బరఁగ హరిగేహమృదులాన్నపానరుచుల
మఱిగి జిహ్వేంద్రియముఁ జాలఁ బరిణమింప
మాధవునియందుఁ జిత్తంబు మట్టుపఱిచి
తాపసుండు ప్రపంచమంతయును మఱచె. 72

ఆ. ఉప్పు నీటిలోన నుంచినకరణిఁ గ
ప్పురము వీతిహోత్రు నొఱసినట్లు

వారిరాశిఁబడినవడగండ్లకై వడి
శౌరియందు మనము సంఘటించె. 73

క. ఈవిధమునఁ దన మేనిస్వ
భావములన్నియును మఱచి పరమాత్మధ్యా
నావేశుఁడై కుచేలుఁడు
భావజగురునెదుట నేమి పలుకకయుండెన్. 74

కుచేలునితోఁ గృష్ణుండుచిన్ననాఁటిచెలిమినిగూర్చి మాటలాడుట.

వ. ఇట్లు నారాయణధ్యానపరాయణుండై యేమియు నననేర
ధారుణీసురుం డూరకుండిన, నయ్యంభోరుహపత్త్రనేత్రుండ
కారుణ్యరసార్ద్రచిత్తుండై, యతండు వచ్చిన ప్రసంగంబ
తయు నాత్మ నెఱింగి, యంగీకరించి, తొల్లిటి సంగతంబ
లుగ్గడించి, యవ్విప్రపుంగవునితో నిట్లనియె. 7

క. ధరణీసురనందన నీ
దరిశనమున మేనుపొదలెఁ దనిసెను జిత్తం
బిరవుగ మన్మందిరములు
పరమపవిత్రంబు లయ్యె భాగ్యము లబ్బెన్. 7

క. పరిపూర్ణంబుగ నాపైఁ
గరుణ వహింపుదువె నీదు కల్యాణశ్రీ
కరగుణవాక్యవిశేషము
లఱిముఱి నే నెవరినైన నడుగుదును సుమీ. 7

ఆ. తడవుదినములకును ధరణీసురశ్రేష్ఠ
మాకు మీకు సంగమంబు గలిగె
నడవియామలకము నంబుధిలవణంబుఁ
గూడినట్టులయ్యె నేఁడుసూడ.

మ. పౌరుగైనం బగవారితోఁ జెలిమి సంపూర్ణంబుగాఁ గూర్తురే
నరులాప్తుల్ గడుదూరదేశమున నున్నన్ గూర్మి వాటింపరే
ధరణిం జాతిఖగంబులుండఁగ మహాదానాంబుదశ్రేణికిన్
బురులల్లార్చి నటింపవే శిఖిచయంబుల్ భూధరాగ్రంబులన్.

ఆ. పుడమిజలములందుఁ బుట్టినకమలంబు
లర్కకిరణములకు నలరినట్లు
దూరదేశగతుల మీరలరాకకే
నెమ్మిఁ గోరుచుందు నెమ్మనమున. 80

క. చాలం జింతిలుచుందును
దాళక నామదిని నీదుదర్శనమునకున్
బాల్యస్నేహవియోగము
లేలాగున నైన దుఃఖహేతువులు గదా. 81

ఆ. పెండ్లియాడినావె పెక్కుఁగాఁ గొడుకులు
గలిగినారె నీకు గ్రాసవాస
ములకుఁ గొదువపడక కలుగుచున్నవియె యే
కాలమునను నొక్కగతి మహాత్మ. 82

క. కులభామిని యేమైనను
గలుఁగుకొలఁది నింటిలోన గహ్వరమునఁ బ్రొ
ద్దులుగడపునె ప్రియమున నా
నెఱఁతుక నీపంపుసేయ నేర్చునె సెప్పుమా. 83

ఆ. ఇంటిలోననీకు నేమాత్రమైనను
గలిగినట్లు దేవకార్యమునకు
నతిథిజనులకీదునె 'యభ్యాగతస్స్వయం
విష్ణు' వనెడుమాట విని ప్రియమున. 84

క. స్నానానుష్ఠానంబులు
మానక యొనరింపుదువె సమస్తమునకు నీ
మేనున దార్ఢ్యము గలదే
మానసమున నిల్చినదియె మాధ్యానంబున్. 85

క. కొడుకుల నిల్లాలిని గడు
బడలంగానీక నన్న పానముల దిగన్
విడువక పోషింపుదువే
సడి కెన్నఁడు నీవు చనక సద్ధర్మమునన్. 86

ఆ. ప్రజలనెల్ల నీతిబాధలఁ బడనీక
పాలనంబుసేసి పరమమైన
ధర్మమార్గమునను ధరణి రక్షింతురే
మీపురంబులేలు మేటినృపులు. 87

ఆ. మనము చిన్ననాఁడు మనలి సాందీపని
యొద్దఁ జదువుకొన్నసుద్దులెల్లఁ
దలఁచుకొందు నెప్డు దలఁచు నీమనమునఁ
దగిలియున్నయవియె తాపసేంద్ర. 88

క. గురుభార్య మున్ను మనలను
జిఱుతల నిద్దఱను వంటచెఱకుల కనుపన్
మురియుచుఁ బరవులువెట్టుచుఁ
దెరలి మహాటవులయందుఁ దిరిగితిమి గదా. 89

ఆ. మఱలివచ్చునెడల మార్గంబెఱుంగక
నల్లెపోయి యడవినట్టనడుమ
బ్రొద్దుమునిఁగి వాన ఘోరునఁగురియంగఁ
దడసి వడఁకితిమి కదా మహాత్మ. 90

క. దుడ్డైలురాకటు మసలిరి
జడ్డుననున్నారటంచుఁ జనుదెంచి గురుం
డొడ్డైన యడవిని బోడఁగని
దొడ్డున మన్నించు టెఱుఁగుదువుగద మనలన్. 91

కుచేలుఁడు దెచ్చిన యడుకులలో రెండవపిడికెడు
కృష్ణుఁడు తినఁబోవ రుక్మిణివారించుట.

వ. అని మఱియును, హరియు బరమాత్ముండయ్యును, ప్రపంచంబులోనివాఁడునుంబోలె బూటకంబున నతని యోగక్షేమంబులరసి, చిన్ననాఁటిమాటలుగ్గడింపుచు 'మహాత్మా మాపట్టణంబునకు నెట్టకేలకుఁ జుట్టంబవై వచ్చుచు నా కేమి దెచ్చితి' వని ముచ్చటపడి యడిగి, యొడలెల్లఁ బుడికి, జీర్ణచేలంబున ముడిచి దాఁచిన యడుకులం గని పిడికెఁడు దిగుచుకొని, భక్షించి, మఱియునుం బిడికెఁడు నారగింప నపేక్షసేయ, సాక్షాదిందిరాదేవియగు రుక్మిణీదేవి, లోకరక్షణ ప్రశస్తంబైన తన మగనిహస్తంబుఁ బట్టెను. అనిన బాదరాయణికి నమ్మేదినీవల్లభుం డిట్లనియె. 92

క. శ్రీహరి యటుకులు మఱియును
మోహంబున నారగింప ముచ్చటపడఁ ద
ద్గేహినియగు రుక్మిణి యే
మూహను జేపట్టి తిగిచె నుచితం బెడలన్. 93

ఆ. అధిపుఁ డారగింప నంబుజేక్షణలును
జెలఁగి సంతసింపవలయుఁ గాక
కుడువవల దటంచుఁ గడు నడ్డపడియెడు
కాంత లెచటనైనఁ గలరె జగతి. 94

ఆ. పనులు సేయునెడల బానిసవలె బుద్ధి
గఱపునెడఁ బ్రధానికరణి భోజ
నంబులిడెడియెడల నంబకైవడిఁ బ్రియం
బాచరించవలయు నండ్రు సతులు. 95

క. అనవుడు శుకయోగీంద్రుఁడు
మనుజాధీశ్వరున కనియె మంజులఫణితిన్
వినుము పరీక్షిన్నరవర
యనుచితములుగావుగద మహాత్ముల చర్యల్. 96

చ. కులమును రూపమున్ గలుగు కోమలి రుక్మిణి పుణ్యసాధ్వి శ్రీ
లలననిజాంశమందుల నిలం బ్రభవించినలక్షణాఢ్య యా
యలికులవేణిభర్తకుఁ బ్రియంబొనఁగూర్ప నెచూచుఁగాక దా
దలఁపున వాక్ఛరీరములఁదప్పనె యెప్పుడు సత్యధర్మముల్.

ఆ. పిడికెఁడడుకులపుడు ప్రియమున భక్షించి
యాకుచేలునకు మహాసుహృనకు
సకలలోకవిభవ సామ్రాజ్యము లొసంగ
మనసువెట్టెనట రమాధవుండు. 98

క. మఱియును బిడికెండడుకులు
గిరిధరుఁడటుఁ బ్రేమ నారగించిన యేనిన్
బరమాదరమున సతనికిఁ
జిరకాలము భృత్యుఁడై వసింపఁగవలయున్. 99

క. కావునఁ బతికి హితంబుగ
నావెలఁదుక మఱియు నడుకు లాహారింపం
గా వలదనియెను భక్తుల
కీవచ్చును రాదనఁడు రమేశ్వరుఁ డెందున్. 100

చ. ధర నొకమర్త్యమాత్రునకుఁ దానొనరించిన మేలుచాలు సు
స్థిరముగ నూర్ధ్వలోకమును జెందఁగఁజేయు సమస్తభాగ్య
ముల్, పరమగురుండులోకపరిపాలకుఁడైన హరిక్ భజించినక్
గరము నిజాధిపత్యములు గల్గుటచోద్యమె మానవేశ్వరా.

వ. అని చెప్పి శుకుండు వెండియు నిట్లనియె. 102

కుచేలుండును సంభ్రమంబునఁ దావచ్చినకార్యము నెఱింగింపకయె మరలుట.

వ. అంత ముకుందుండు, రుక్మిణీకాంతానివారితకార్యుండై
యత్యంతతృప్తుం డగువాఁడునుంబోలె, నాదరంబునసయ్యా
దుకు లతని జీర్ణవస్త్రంబునఁ గ్రిమ్మఱ ముడిచి, యాకుచే
లునిక్ బహుప్రకారంబుల నూరడించి, పంచిన, నాయకిం
చనుండు నిశ్చలచిత్తుండును, నిర్మలుండును, నిర్గుణుండును
గావునఁ, బురుషోత్తమునిం గనుంగొంటి, నావంటి భాగ్య
వంతుఁడు గలఁడే యని సంతోషించుచు లేచి, శౌరికి
నమస్కరించి, యేమియు నడుగనేరక ముగ్ధత్వంబునఁ
దద్గృహద్వారంబు వెడలి, కొలువుకూటంబు దాఁటి చను
చున్నవాఁడు. 103

క. ఆకొలువులోననుండిన
యాకర్ణాంతేక్షణలు మురాంతకునిసతుల్
రాకేందుముఖులు చక్కని
కోకస్తను లొకరికొకరు గురుహృదయములన్. 104

క. ఎంతటిదయవాఁడే శ్రీ
కాంతుండేమైనసీక కదలుమనిన వి

భ్రాంతుండై చనె విప్రుఁడు
వింతలు ధర నిట్టివనులు విన మెన్నండున్. 105

ఆ. హరియు లేచు టెట్టు లర్ఘ్యపాద్యాదుల
గారవించు టెట్లు కాసువీస
మేమియును నొసంగ కేఁగుమా యను టెట్టు
లెంత భాగ్యహీనుఁ డిల నితండు. 106

ఆ. కుడువఁ గూడుఁ గట్టఁ గోకయు లేకను
జేరినట్టి తొంటి చెలిమి కాని
బూటకములు వలికి పొమ్మని పంచె నీ
జలజలోచనునకు సత్య మేది. 107

తే. అరయ 'నాడంబరాణి పూజ్యాని' యనుచుఁ
జాటుచుండెడి నీతిశాస్త్రము నిజంబు
బడుగు లెచ్చోటి కేఁగిన బ్రదుకుగలదె
బూటకులఁ గాని మెచ్చరు భూమిపతులు. 108

ఆ. దీనజనులు ఘనులఁ దిరియంగఁ బోయినఁ
గోకయైన నొక్క రూకయైన
నిచ్చి పంచుటదియె యెంతయు బహుమాన
మిల్లె యనుటయదియె హీనతయగు. 109

ఆ. అఖిలరాజ్యమేలు హరిసఖుండయ్యు నా
చెనఁటి భూసురుఁడు గుచేలుఁడయ్యె
భూజనంబు నేలు రాజు మగండయ్యు
గాజుకడియమనెడి గతి చెలంగ. 110

ఆ. బడుగు బాపనయ్య బ్రదికించినందులోఁ
గానవచ్చె శౌరికరుణ యెల్ల

మునికి విందుగలదు ముంజేతికంకణం
బునకు నద్దమేల పొసఁగఁజూడ. 111

తే. ఎంతదవ్వులనుండియో యేఁగుదెంచి
కడేఁడుమెతుకులకై యింత కష్టపడెడుఁ
గటకటా యదృష్టహీనురాగ్రణివిధంబు
కొండఁద్రవ్వియు నెలుకను గొనుటయయ్యె. 112

ఉ. కామితవస్తుజాతములు గల్గి దయాపరులై నపుణ్యులన్
బ్రామితనిచ్చిపుచ్చుకొనుభావమునన్ దలపోయఁడెంతయున్
గ్రామముక్రొత్తయెనఁ దనకర్మముక్రొత్తయె పెక్కుమాటలిం
కేమి యదృష్టహీనునకు నెచ్చటనైనను గల్గునే సిరుల్.

క. మనకేమిదెలియు శ్రీకృ
ష్ణునిబూటకములును భూమిసురవరుమహిమల్
మనసునకుమనసె తార్కా
ణనుసామిత పీఠియందె యందంబయ్యెన్. 114

వ. అని పలికి, సఖిజనంబు లొకరికొకరు తమలోఁదమరు మొగ
మొగంబులు చూచుకొనుచు, దరహాసంబు నెఱపుచుం
డిరి. అంత నాభూసురోత్తముండు జలరాశిదాఁటి పెక్కు
దేశంబుల వాసరంబులు గడుపుచు, వాసుదేవపదధ్యాన
మనస్కుండై, మహోల్లాసంబునం జనిచని, నిజనివాసంబు
నకు మరలి వచ్చునప్పుడు. 115

{ కుచేలుఁడు తనవాసముచేరి యైశ్వర్యముఁ బొంది క్షేమించుట. }

సీ. ఉపవాసములచేత నొగిలి డస్సినమేను
రక్తమాంసప్రపూర్ణతవహించె

బలువుగాఁ జినిఁగిన ప్రాఁతకుచేలంబు
కాంచనాంబరమై ప్రకాశమొందె
గళమున నిడుకొన్న తులసిపూసలపేర్లు
మౌక్తికహారనిర్మలతఁ దాల్చె
మృదుకరాంగులముల మొదురుదర్భలముళ్లు
రత్నంపుమెఱుఁగుంగరంబులయ్యె
తే. చెవులవ్రేలాడుబలుఖుత్రజీవికాయ
లెలమి మణికుండలంబులై యెప్పుఁజూపెఁ
జెలువ మంతంతకును హెచ్చ శ్రీమురారి
పరమకరుణానురక్తిని బ్రాహ్మణునకు. 11(

తే. హరికరస్పర్శనమునను నధికదేహ
దాహమెడలెను భద్రమాతంగవిభుని
కరణి ధాత్రీసురునకు భీకరదరిద్ర
తాపములు మానె శౌరిసందర్శనమున. 11'

వ. ఇట్లు, కృష్ణుని సందర్శనంబున మహైశ్వర్యంబులు వొడవి
నఁ, బరమాశ్చర్యపరుండై భూసురుండు సనంజన, వె
డియుఁ బురోభాగంబున నున్న పురంబుల నృపతులు, శ్రీ
హరిప్రేరితులై కదలి, కరితురగస్యందనాదిబలంబులతో
దుర్గాని, యుదయశైలంబుననున్న యర్కునింబోలెఁ
న్న నగణ్యకల్యాణనిపుణరథారోహణుంజేసి పరివేష్టించి
నడువనెడనెడఁ దమ రూపంబులతోడఁ బొడగట్టి వేలు
లనల్పకుసుమవర్షంబులు గురియింపుచు, దుందుభులు మో
యింపఁ, బ్రహ్మాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీ

శుక శౌనకాది పరమభాగవతులు గీర్తింప, దివ్యాంగనలు
నటింప, మహావైభవంబున. 118

మ. పరితోషంబునుబొందె బ్రాహ్మణుఁడు దద్భాగ్యంబు
సిద్ధించుటన్, బరమాత్ముం డగుశౌరి యుత్తమపరబ్రహ్మం
బు ధాత్రీస్థిణి, న్నరజన్మంబునుబొంది తాఁ బెరిగి నానా
యోగభోగంబులన్, బొరయన్ వేడ్కపడంగ నొల్లఁడె
కరంబున్ మర్త్యుఁడీ సౌఖ్యముల్. 119

క. శ్రీగరుడగమనుఁ గొలిచిన
భాగవతోత్తముల కెలమిఁ బరమాయువులున్
వేగఁ గరి తురగ రథ భట
భోగంబులు గలుగు టరుదె భూతలనాథా. 120

క. పెట్టినతద్వాసరముల
గట్టిగ సంపదలుగలుగుఁ గట్టఁడియై మున్
బెట్టనిదినముల లేములు
దొట్టును మనుజులకునెల్లఁ దుదిజన్మములన్. 121

తే. అనినవిని యర్జునునిపౌత్రుఁ డాత్మనలరి
పద్మనేత్రు కథాసుధాపానమునను
దనివిసాలక శుకుని మోదమునఁ జూచి
యనఘ యటమీఁదికథ లెట్టులయ్యె ననిన. 122

మ. హరిమాయోగ్రశిలాప్రవర్షభయఘోషాబ్జేక్షణాగోపగో
వరగోవత్సగణాభివందిత మహావాత్సల్య రాధామనో
హరలావణ్యవిలాసవిభ్రమకళాహంకారబాణాసురో
త్కరదోర్దండసహస్రఖండన జగత్కల్యాణకల్యాత్మకా.

క. శరచర కచ్ఛప కిటి నర
హరి వటు భృగురామ రామ హలి బుద్ధ మహో
త్తురగారోహణరూపక
స్మరసదృశాకార కపటమనుజశరీరా. 12

భుజంగప్రయాతము. సమస్తావనీనాథ సంసేవ్యపాదా
రమారూపరేఖాభిరామప్రమోదా
హిమక్షీరవాక్కీర్తిహేలావినోదా
విమాలిన్యవిజ్ఞానవిద్యాప్రమోదా. 12

గద్య. ఇది శ్రీమద్భ్రమరాంబికావరప్రసాదలబ్ధసరసకవిత
ధురంధర సకలకవిమిత్ర యల్లనామాత్యపుత్త్ర సకలసద్గ
ణవిధేయ గట్టుప్రభునామధేయప్రణీతంబైన కుచేలోప
ఖ్యానంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము
సమాప్తము.



శ్రీ ర స్తు.

# తృతీయాశ్వాసము.



క. శ్రీలక్ష్మీమందిర శిశు
పాలజరాసంధకంసబలభంజన గో
పాలనిజకన్యకాత్యను
కూలకళాలహారి కృష్ణ గోపాల హరీ. 1

వ. అవధరింపుమని పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డి
ట్లనియె. 2

ఆ. మానవేంద్ర వినుము మసలకా విప్రుండు
సకలరాజ్యభోగసహితుఁ డగుచు
హరిదయావిశేష మాత్మలో మెచ్చుచుఁ
జేరెఁ దొంటిపల్లె చేరువకును. 3

క. అది మిక్కిలి హరికరుణను
మొదలిపురంబులకు నెల్ల మొదలిపురంబై
సదమలమై బహుభోగా
స్పదమై విలసిల్లె సకలసౌభాగ్యములన్. 4

కుచేలుఁడు తనపల్లె నిప్పుడుండెడు రీతిని జూచుట.

సీ. మాణిక్యకీలిత మహితసౌధంబుల
నున్నతప్రాకారయూధములను
గంచుమించుగ దువాళించువాహనముల
గీతఘూర్ణితసభాగేహములను

జగతీసురులు పెక్కు చదువువేదంబుల
బండితోత్తమశాస్త్రిపాఠములను
గురుతరబహురత్నకులగోత్రములు సమా
కుంచితకేళిశాకుధరములను
తే. బలువులగునట్టి తేరులు బహులవాద్య
నాదములను దగినరత్నవేదికలను
వీరపరివారముల మంచి తీరములను
బరగఁగనుపట్టె నమ్మని పట్టణంబు.
తే. అమ్మహారాజధాని నెయ్యమునఁగాంచి
పల్లెయును బట్టణంబయ్యెఁ బద్మనయను
మాయఁ దెలియంగశక్యమే మనకు నంచుఁ
దత్పురద్వారదేశంబు దరియ నచట.
క. అందలములు గుఱ్ఱంబులు
స్యందనములు భటులు భద్రసామజములు బల్
మందగాని తోలఁగఁద్రోయను
సందెందును లేక దొడ్డ సందడియయ్యెన్.
తే. అప్పురాంతరమున నున్నయట్టిప్రజలు
దొరలు రాజులు భటులు మంత్రులును బుధులు
హర్షములతో నెదుర్కొని యతనికపుడు
గానుక లొసంగి మొ్రక్కిరి గౌరవమున.
వ. ఇట్లు మహైశ్వర్యంబున నయ్యార్యుండు తేజోవిరాజమా
నుండై రాజమార్గంబున వచ్చునప్పుడు.
క. సౌధాగ్రంబులఁదగు నవ
క్రోధాబ్జాక్షులశరీరరుచులాభరణా

గాఢ ప్రభలును జాలక
యూధంబున వెంటవెడలి యుప్పతిలంగన్. 10

తే. కాంచి వీక్షించుచున్నారె కాంతలార
మిగులవరిటెన గోకబికిమేనివాఁడు
మనకుచేలుఁడు హరిదయామహిమ నేఁడు
కన్నులకునెంత చెలువమై యున్నవాఁడు. 11

మ. బలిమిన్వాయువు గ్రోలి యాకులలముల్ భక్షించి కందంబు
లున్, ఫలముల్మూలములున్ మెసంగి జలముల్ పానంబు
గావించి నిశ్చలతన్ ఘోరతపంబుఁజేసి హరిచే సౌభాగ్య
ము ల్చేకొనం, గలరే యీతనినాటి లోకముల సంకల్పం
బునం జూడఁగన్. 12

క. సతతంబును నీవిప్రుని
యతిశయసద్ధర్మఫలము లవి వృథయగునే
స్మృతి 'ధర్మోవర్ధతివ
ర్ధతి' యనియెడువాక్యమునకుఁ దప్పాలుగలవే. 13

ఆ. ఎవఁడు సకలభూత హితదయాధర్మంబు
లెఱిఁగి నడుచువాఁడె హెచ్చునిలను
మున్నువలుకుశాస్త్రములు 'యతో ధర్మస్త
తో జయం' బటన్న నైజమయ్యె. 14

తే. సిద్ధముగను త్రికరణసంసిద్ధిగాఁగ
శ్రీహరినినమ్మియుండిన శిష్టజనుల
కెల్ల సంపదగల్గుట కేమి యరుదు
లక్ష్మిశౌరికటాక్షంబు లనవసించు. 15

క. దారసుతముఖ్యులందే
కారణముననైన మనసు గదియింపక జ్ఞా
నారూఢుఁ డైనయీఋషి
కీర్తిని సిరులుగలిగె నిది యరుదుగదా. 16

మ. చ్యవనుండిట్టుల గాదె నిష్ఠురతపస్సామర్థ్యుఁడై మిక్కిలిన్
వివిధారణ్యగిరిప్రదేశములలో వేయేండ్లు వర్తించి యా
భువిసంయాతికుమారిఁ గైకొని మహాభోగంబులం జెందఁడే
సవిధిన్‌దొల్లిటివారుమానిరెవధూసంయోగసౌఖ్యంబులున్.

క. ఈలోకంబున రాజ్యము
లేలన్‌గల్గినను జాలు నెంతవిరక్తుం
డేల విసర్జనసేయును
బాలొల్లనిపిల్లిగలదె పరికింపంగన్. 18

ఆ. దైవయోగమునను దట్టినమేలుకీ
ళ్లనుభవింప కెట్టు లగుగవచ్చుఁ
గాన నార్యులొక్కగతినుండుదురు సుఖ
దుఃఖములకు మనము దొరఁగనీక. 19

తే. కొట్టినను గారవించినఁ గుడుపులిడినఁ
బస్తువెట్టినఁ దిట్టిన బహువిధముల
వేఁడుకొనినను మఱియొక్కవిధముగాఁగ
స్రుక్కునిక్కులుగలుగునే సుజనులకును. 20

మ. స్థిరబుద్ధిన్ జనకుం డనంగనొక ధాత్రీభర్త యేప్రొద్దు దు
ష్కరవైశ్వానరపూర్ణకుండమున శ్రీగంధపుపాత్రంబున
న్జరణంబుల్పదిలంబుగా నిలిపిస్వేచ్ఛన్రాజ్యమున్ జేసె నీ
ధరశీతోష్ణము లొక్కచందమున నాత్మన్జింతన ల్సేయుచున్.

ఆ. అటుల నాకుచేలుఁ డత్యంతమును లేమి
కలిమియును సమంబుఁ గాఁ దలంచి
దైవఘటనఁ దొరసి తనకర్మమున మన
సొగ్గియుండు జ్ఞానయుక్తుఁ డగుట. 22

సీ. బహువిధంబులఁ దనభార్య ప్రార్థించినఁ
జిరతరకరుణార్ద్రచిత్తుఁ డగుచుఁ
గడఁగి 'సర్వేజనాః కాంచనమాశ్రయం
తే' నియెడుశ్లోకార్థ మనుసరించి
ద్రవ్యంబుకంసవిధ్వంసుని యాచింప
సరవితోఁ దనకును శౌరియొసఁగుఁ
గలకొలఁదిగ ద్వారకాపురంబున కేఁగి
మురవైరిఁ బొడగాంచి మురిపెముగను

ఆ. నేమి యడుగ మఱచి యిందిరాధీశుచే
గౌరవమును బొంది కదలివచ్చి
శౌరియొసఁగు సకలసామ్రాజ్యలక్ష్మిని
బొందినాఁడ యెంత పుణ్యుఁ డితఁడు. 23

వ. అని, ప్రౌఢలగు నప్పువ్వుఁబోఁడులు బహుప్రకారంబులఁ గొనియాడ, నమ్మునిచూడామణి యాందోళికాఛత్రచామరంబులు మొదలైన చిహ్నంబులు పరిగ్రహింపుచు, భేరీమృదంగ శంఖ కాహళ గంభీరనాదంబులు భోరుకలుగ నిజాగారంబునకుం జనుదెంచునప్పుడు. 24

కుచేలుఁడు తనపర్ణకుటీరము స్వర్ణసౌధమగుటను గని భ్రమించుట.

క. మునుపటి పర్ణకుటీరము
కనకమయంబై యతుల్యకల్యాణంబై

ధనధాన్యసంభరితమై
ఘనమైయుండంగఁజూచి కడువెఱఁగుపడెన్. 25

ఆ. అతనిభార్య కోమలాంగి సాధ్వీమణి
యఖిలరత్నకాంచనాభరణవి
భూషితాంగియగుచుఁ బూచినతంగేటి
కరణిఁ జెలువ దాను గదలివచ్చి 26

ఆ. పసిమిగలిగినట్టి మిసిమిబంగారపుఁ
బల్లెరమున ధవుని పాదపంక
జములనునిచి సతులు జాళువాగిండిని
గరిమఁ బరిమళోదకములు వోయ. 27

క. కడిఁగి తనపైటకొంగునఁ
దడియొత్తి యనర్ఘరత్నతతు లంబరముల్
పిడికిళ్లకొలఁది మాడలు
గుడియెడమను బాఱవైచెఁ గోమలి వేడ్కన్. 28

క. కైదండ యొసఁగి మఱియా
పైదలి చేయూఁది వెంటఁ బఱతెంచిన య
మ్మేదినిభర్తల నందఱ
నాదరమునఁ దొంటికడల కనిపి ప్రియమునన్. 29

క. ఇరుదెసల నంబుజాక్షులు
పరివేష్టించుకొనినడువఁ బటుతరవిభవ
స్ఫురణఁ గుచేలుఁడు దనమం
దిరముఁ బ్రవేశించె నధికతేజోనిధియై. 30

కుచేలుఁడు సుఖంబుల ననుభవించుట.

సీ. ప్రాణనాయకునిఁ దద్భార్యాశిరోమణి
గరిమెతో ముత్తెపు గద్దెమీఁదఁ
గూర్చుండనియమించి కొమ్మలందిచ్చిన
బంగారుగిన్నె సంపంగినూనెఁ
దలయంటి పరిమళోదకముల నభిషేక
మలరించి యొకదుకూలాంబరమునఁ
దడియొత్తి పట్టువస్త్రములు గట్టఁగనిచ్చి
భూషణంబులు మేనఁ బొందుపఱిచి
తే. మృదులకర్పూరకాశ్మీరమృగమదములఁ
గలపములుగూర్చిమించి శ్రీగంధమలఁది
యమృతశాల్యన్నశాకపాకాదికంబు
లారగింపంగఁబెట్టె నయ్యధిపునకును. 31
తే. కప్పురపుఁ దావులొసఁగు బాగాలొసంగి
తెల్లగాఁ బండఁబాఱిన తెల్లనాకు
మడుపులిచ్చుచు సౌఖ్యంబు లడరఁ జేసి
భోగములఁదృప్తిఁ బొందె నా ఫువ్వుబోఁడి. 32
వ. ఇట్లనంతుని కరుణాప్రసాదంబునంగలిగినమహైశ్వర్యంబున ననంతసుఖంబులనుభవించుచుఁ గొన్నిదినంబులకుఁ దృప్తుండై, యాభూసురశ్రేష్ఠుండు కాంతాసుతాదుల నెడఁబాసి యేకాంతంబుననుండి తనయంతరంగంబున. 33

కుచేలుఁడు విరక్తుఁడై కృష్ణుని మదిఁ దలంచుట.

సీ. పరమేశ యిందిరాపతి మురారి ముకుంద
వసుదేవతనయ శ్రీవరద దీన

పాలన పూతనాప్రాణాపహార దేవ
కీతనూభవ సర్వభూతమయ జ
రాసుతమాయావిరావణ వేణునా
దవినోదశిశుపాలదర్పమథన
సత్యావధూసౌఖ్యసంయోగ రౌహిణే
యానుజ గోపాలకాగ్రగణ్య
తే. ద్రౌపదీమానరక్షక ధార్తరాష్ట్ర
గహనపావక శకటారి కంసహరణ
నందనందన సచ్చిదానందరూప
కేశవానంత పరమాత్మ కృష్ణకృష్ణ. 34
తే. చేయుదువు పుణ్యపాపము ల్జీవుఁడవయి
తథ్యముగఁ బొందుచుందువు తత్ఫలముల
మురహరముకుందపరమార్థములనుఁజూడఁ
గర్తయును నీవ పిదప భోక్తయునునీవ. 35
క. సామజఘటలును మొదలుగ
దోమలు తుదగాఁగ ధరణిఁ దోఁచినజీవ
స్తోమంబు లశేషంబులు
నీమూర్తివిభేదములుగ నెగడుదువుహరీ. 36
సీ. అరయ 'నణో రణీయా న్మహతో మహీ
యా' ననుశ్రుత్యర్థ మదినిజముగ
దానవాంతకనీవు ధరణిలోనను మహ
త్పరిపూరితుండవై పరఁగియుండి
యెందు లేఁడనిపింతు వీశ్వర నీమాయ
తెలియ శక్యమె యెట్టిధీయుతులకు

నిది యెఱుంగక కొంద ఱెలమిఁ గర్తలమంచ
హంకరింతురు తామసాత్ములగుచు
తే. నాలఁ గుఱ్ఱల గోపాలబాలకులను
దాఁచుకొనుధాత కేస్వతంత్రత్వమబ్బె?
ఘోషములమీఁదబలుఱాలఁ గురియఁజేయు
వజ్రిపూనిక చెల్లెనె వారిజాక్ష. 37
ఆ. తగుప్రయోజనములు తామె చేసితిమని
యాత్మఁ దలఁచుచుందు రల్పమతులు
తద్విధంబులెల్లఁ దమలోపలనె యుండు
నీ వొనర్పు టెఱుఁగనేర రెవరు. 38
ఆ. మ్రాకులోనిచేవమాడ్కిఁ బూసలలోని
దారమట్లు శిలల తతులలోని
లోహమువిధమునను లోకంబుజీవుల
లోననుందు వెందుఁ గానరావు. 39
క. తగువునఁ బుట్టినయనలము
తెరఁగున దధిఁ బొడముఘృతము తీరున మదిలో
నరయఁగ యోగీశ్వరులకు
నరగునఁ బొడసూపుదువు నిజముగ ముకుందా. 40
ఆ. ఇంద్రియముల నిగ్రహించి కామంబును
లోభమోహములను లోనుబఱిచి
యుపవసించి శీత ముష్ణంబుఁ దలఁపక
తపము సేయు కేల తక్కుదేను. 41
ఉ. పేరిమితోవలంబడిన పిట్టయుఁబోలె నపార ఘోర సం
సారదురంతపాశముల సందు దగుల్పడి నే భవత్పదాం

భోరుహచింతనంబుఁ మదిఁ బూనుట కేమతి యుంటినక్కటా
తీరునె సంపదల్గలుగు దేహునకున్నినుఁ బూజసేయఁగన్.

సీ. శాల్యోదనాపూపసద్యోఘృతంబులు
మెసఁగ మేనునఁ గండ మెండు గలిగి
రక్తమాంసప్రపూర్ణత నింద్రియంబులు
ప్రబలమోహంబు లోభంబు నిగుడ
దారసుతులయందుఁ దనివిచాలకబహు
ద్రవ్యమందు సపేక్ష దారసిల్లు
మున్నె 'యర్థాతురాణాన్న గురుర్నబం
ధు' వనెడివాక్యంబు దోడుగాఁగ

తే. పేదలకు బాంధవులకును బెట్టు టుడిగి
పరమనాస్తికులై జనుల్ బ్రదుకనాస
పడి చెడుదు రంతమున జముబారిఁ ద్రెళ్ళి
జీవులకు దొడ్డసంపద ల్చేటుగావె. 43

ఆ. ధనము గూర్చి నరుఁడు తస్కరుల్ క్షత్త్రియు
లపహరింతు రొక్కొ యని కృశించు
స్త్రీల నేలువాండ్రచిత్తంబు లేరిపైఁ
బాఱునో యటంచుఁ బరితపించు. 44

మ. తనయుల్వైరులరొండొరుల్జతపడన్ దాయాదులీక్షింతురే
మనుజాధీశులు తప్పులారయుదురే మాయింపసర్వస్వమున్
వనజాతేక్షణ తొంటిచందముననే వర్తింతునే నొల్లఁబో
ధనముల్మిక్కిలి దుఃఖహేతువులగున్ ధాత్రీజనశ్రేణికిన్.

ఆ. బహుళముగఁ బ్రయాసపడి దినంబులు సాఁకి
సంతరించి నట్టి జనుల ప్రాణ

మానములహరించి మగిడిపోయెడివేళ
ధనము పాపకర్ముఁ డనుట నిజము. 46

ఆ. పేర్మినదురుగుండె పిక్కచెదరు లేక
యుండవచ్చుఁ బేద యులుకు దక్క
రమణ 'గోఁచిపాఁతరాయఁడు దొంగల
మిండఁ' డనెడుమాట మేలుదెలిసి. 47

ఆ. సకలమైనరాజసంఘంబులకు లొంగి
యాత్మఁ జోరజనుల కలికియలికి
యలమటించు నట్టియైశ్వర్యములకంటె
నాకుఁజూడ లేమి నయము కృష్ణ. 48

క. మీసాలమీఁది తేనియ
లాసలపుంజంబు లిట్టియైశ్వర్యంబు
ల్దోసములపుట్టినిండ్లని
యే సత్యము వెడలఁజేయు నీక్షణికమునన్. 49

క. నానావిధసకలైశ్వ
ర్యానూనతమఃప్రపూర్ణుఁ డై మర్మంబు
ల్గానఁడు ధనమద మేద ని
ధానమునకు దీపకళిక దారిద్ర్యం బౌ. 50

మత్తకోకిల. ఎండమావులు నీరుబుగ్గలు హీనదర్పణరూపముల్
చండవాయువు లాయువు ల్బహుచంచలంబులు ప్రాణముల్
పండువెన్నెల లంబుదంబులు భంగురబ్ధితరంగముల్
మెండుసంపద లే నిజంబులు మేదినిన్గరుణామయా.

ఆ. కొఱ్ఱగింజ నోరఁ గొఱికియు నొకప్రొద్దు
చెఱుచుకొన్న విధము కొఱఁతలైన
సిరులు నమ్మి నీదు శ్రీపాదచింతన
మఱచినాఁడ నెంత మందమతిని. 52

ఉ. అన్నము లేక యుండిన లయం బగు దేహము రక్తమాంసము
ల్సున్నగు నింద్రియస్ఫురణ స్రుక్కు మదాశయంబు దూరమౌ
నన్నలమీఁది పేర్మి చెడు నచ్యుత నీపయి నిల్చు మానసం
బెన్నటికై నజ్ఞానులకు హెచ్చు దరిద్రత పాటియే సిరుల్. 53

ఉ. ఓపినయట్లు భోగముల నొందినమీఁద వహింపఁగావలెన్
దాపసవృత్తి నంచు మదిఁ దప్పక యుందురు కొందఱక్కటా
యీపురుషాయువల్పమిఁక నిందులకందుల కేమి యుద్దము
ల్వాఁపరకాయచేఁ దెఱఁగి భక్షణసేయుట నీతియే ధరన్.

క. బెత్తుగ 'వృద్ధత్వే ముని
వృత్తీనా' మనెడుపల్కు విననొల్లక య
త్యుత్తములు మొదలనుండియుఁ
జిత్తమునినుఁ జేర్చి ముక్తిఁ జెందెదరు హరీ. 55

ఆ. వయసునాఁడు భోగవంతుఁడై ముదిమిని
దపమొనర్తు ననుచుఁ దలఁపఁ దలఁప
యౌవనమునఁ జచ్చునతఁడు వృద్ధగుదాఁక
బ్రదుకు టేమినిజము పంకజాక్ష. 56

ఆ. పండువంటివయసు బలుకాఁపురము సేయ
జపతపంబులకును జాలలేఁడు
మీఁదిదినములనుచు మిన్నతుల్వాలికెడి
భ్రాంతజనులఁదగదు పాటిసేయ. 57

క. ఆయువు నిండనియప్పుడె
కాయంబున జీవబలము గలిగినయపుడే
ధీయుక్తిఁ దూలనప్పుడె
శ్రీయువతీరమణ నిన్నుఁ జింతింపఁదగున్. 58

సీ. ముదిమిపైవేశించి మూల్గించునప్పుడు
కుత్తుక శ్లేష్మంబు గూర్చునపుడు
బలువైనమూర్ఛలు ప్రాపించునప్పుడు
నెదురుఁ దన్నెఱుఁగక యదరునపుడు
పలుమాఱు రుచులకుఁ బ్రతిమాలునప్పుడు
వడిచెడి దేహంబు వడఁకునపుడు
కష్టంపురోగము ల్గాఱించునప్పుడు
మలమూత్రములలోన మెలఁగునపుడు
తే. బహుదినంబుల నాయాసపడెడునపుడు
గొణుఁగుమాటల రసనంబు గుదియునపుడు
వేదనలఁబొంది ప్రాణము ల్వీడుచునపుడు
నరుఁడు నిన్నెట్లుదలఁచు శ్రీనలిననయన. 59

ఆ. ఇపుడు నరులబ్రదుకు లిఁక నెంతసేపటి
శాశ్వతములుగావు క్రూరయముఁడు
గరుణలేనివాఁడు గావున శీఘ్రంబె
శ్రీశ నిన్నుఁ బూజ సేయవలయు. 60

సుచేలుఁడు ముక్తికై శ్రీకృష్ణుని ప్రార్థించుట.

ఆ. నిన్నుఁగొలుచు టుడిగి నేనొల్లఁబో సిరు
లనుభవింప నరుని యాయువల్ప

మిట్టివాసరముల నిందీవరాక్ష నీ
పాదచింతనంబు పాడుకొల్పు. 61

క. కావున నేనిఁక దొల్లిఁటి
త్రోవనె విహరింతునట్టి తుచ్ఛపుసిరులుం
గావలెనే యిన్నియు నీ
సేవాధర్మంబు నాకుఁ జిత్తజజనకా. 62

తే. ఏడిచెడి పిన్నవాండ్రకు నిన్నిపప్పు
గింజలిడిపోరుమాన్పినక్రియను జాలఁ
దుచ్ఛమగుసంపదలొసంగితొలఁగిననన్ను
మత్తునిగఁ జేసినావు నీచిత్తమింకను. 63

క. మురహర యీగ్రామము లీ
పురములు నేనొల్ల నిన్నుఁ బూజ యొనర్తుం
బరమమునులు 'రాజ్యాంతే
నరకం ధ్రువ' మనెడిమాట నాకుఁదెలియదే. 64

శా. పారం బెన్నఁడు లేనిమోహలతిక ల్బంధింప సంసారఘో
రారణ్యంబునఁ ద్రెళ్లి దారసుతముఖ్యాఖండితాశారుజల్
గాటింపన్ బహుదుఃఖవేదనల జీకాకయ్యెడిన్ డెందమో
కారుణ్యాంబుధిశౌరినీదయినయాకారంబుఁజూపంగదే. 65

ఆ. భ్రమసి తేనెలోనఁ బడినయీఁగయుఁబోలె
భోగములనుదగిలి పొగలువాఁడఁ
జిత్తగించి నీదు శ్రీపాదదర్శన
మిచ్చి ప్రోవవయ్య యిందిరేశ. 66

ఆ. మూలనున్నవాని ముంగిటఁ బడవైచి
సిరులొసంగి యిట్టు చేసినావు

దండిసంపదలు వృథాడంబరంబుల
యేల మమ్ముబోంట్ల కివి మహాత్మ. 67

వ. అని శ్రీకాంతునిం గూర్చి యత్యంతచింతాశీలుం డై కుచేలుండు బహుప్రకారంబుల స్తుతియించినఁ, దదీయభావశుద్ధి కాత్మనలరి యాద్దేవదేవుఁడు గరుణారసార్ద్రచిత్తుండై.

—॥ కుచేలునికి కృష్ణుఁడు దర్శనమిచ్చుట. ॥—

సీ. శ్రీవత్సకౌస్తుభ శ్రీవేయముంతోడ
లాలితమణికుండలంబుతోడ
మాణిక్యకాంచనమణికిరీటముతోడ
రహిమించు పీతాంబరంబుతోడ
శంఖచక్రగదాది సాధనంబులతోడ
నమితరత్నాభరణములతోడఁ
బెడతలవ్రేలాడు పికిలిపించముతోడఁ
గస్తూరికాంగరాగంబుతోడ

తే. జాంబవతియును గాళింది సత్యభామ
మిత్రవిందయు భద్రరుక్మిణియునంగ
మహిషులందఱు సేవింప మానిమొదుట
శకటదానవవైరి సాక్షాత్కరించె. 69

తే. ఇట్లు ప్రత్యక్షమై యాదవేశ్వరుండు
గౌరవముతోఁ గుచేలుని గారవించి
యాఘనునిచేత నర్ఘ్యపాద్యాదులైన
యతిథిపూజల నొంది యిట్లనుచుఁ బలికె. 70

క. మెచ్చితి నీ నైష్ఠికతకు
నిచ్చకువచ్చినవరంబు లిపుడే మొనర

ఇచ్చెద వేఁడుమనినఁ గడు
ముచ్చటపడి యపుడు విప్రముఖ్యుఁడు పలికెన్. 71

ఆ. మెఱసి పిచ్చుగుంటుమీఁద భాగీరథి
వచ్చినట్లు మిగుల వాంఛగలిగి
స్వామిమీరలిటకుఁ జనుదెంచితిరి కడు
భాగ్యయుతుఁడనైతిఁ బద్మనయన. 72

క. నిరతంబును 'నాశాశా
పరమందుఃఖ' మ్మటంచుఁ బలికెడిశ్రుతులన్
గురుఁతెఱిఁగి వృథాతృష్ణా
తురత భవచ్చరణములకు దూరుఁడనైతిన్. 73

సీ. నిత్యంబులా సిరుల్ నెఱయ నత్యంతంబు
దురితంబుఁబొందించి తొలఁగుఁగాక
సతములా ప్రాణము ల్సంతతంబును భవ
సుఖదుఃఖములఁబొంది స్రుక్కుఁగాక
కాణాచిభూములా కాయమునీళ్లపై
బుగ్గలవలెఁబుట్టి పోలియుఁగాక
చుట్టంబులా సుతు ల్వట్టి యాశాశల
నెంచంగఁ బగదాయ లింతెగాక

ఆ. యిట్టితుచ్ఛపదవు లేనొల్లను మదీయ
మానసముననిన్నె మరిఁగియుందు
నీళ్లనైనముంచు నిక్కంబుగా ననుఁ
బాలనైనముంచు పంకజాక్ష. 74

శా. ఆలంటన్ సుతులంట చుట్టములటంటన్ జేసి యాశాశలన్
జాలాదుఃఖపరంపరల్బొడమ నే సౌఖ్యంబులం గానతే

శ్రీలక్ దురటిల్లుదుర్ దురితదేహి న్నన్ను రక్షింపుమో
శ్రీలక్ష్మీపతి నందనందన హరీ శ్రీకృష్ణ రామానుజా. 75

తే. సకలదుఃఖములకు జననస్థలములైన
యిహసుఖంబు లిచ్ఛయింప దాత్మ
పరమపదమునీదు పాదపంకజములఁ
జేర్చుకొనుము నన్ను శ్రీనివాస. 76

వ. అనినఁ బరమేశ్వరుండు మఱియు నిట్లనియె. మహాత్మా, నీవు జిహ్వాత్వగాది దుష్టేంద్రియంబులఁ గుదియించి, కామక్రోధ లోభ మోహంబులు పెరుగనీక దారసుతాదులపై మోహంబు విడిచి, కందమూలఫలపర్ణజలానిలభక్షణంబులఁ బ్రాణసంరక్షణంబు సేయుచుఁ, ద్వగస్థిమాత్రశరీరుండవై, యేకాంతకాంతారంబుననుండి సుజ్ఞానవంతంబైన నిజస్వాంతంబు నాపయిన్నిలిపి, యెత్తఱినైనఁ దుచ్ఛభోగంబులందుఁ బ్రమత్తుండవుగాకుండు మెఱుంగుదునైనను, దైవయత్నంబునంబొదవిన శుభాశుభంబు లనుభవింపక పోవచ్చునే? నీవు మాకు పిడికెఁడటుకులు సమర్పణంబు చేసినకతంబున మహదైశ్వర్యంబులు గలిగె; ఎందును సత్పాత్రుల కిచ్చిన దానంబులు నిష్ఫలంబులుగావు; అనంతంబులై ఫలియించు? మున్ను వామనునకుఁ బుడమి మూఁడడుగు లొసంగినకతంబున బలిపాతాళభువనం బేలుచున్నవాఁడు, ధ్రువవిభీషణులిట్టివారే కావున, నేనిచ్చిన వరంబు లధ్రువంబులు గానేరవు. నీవు చిరకాలంబు సంపద లనుభవింపుము. అంతంబున నిన్ననన్నుంజేర్చుకొనియెద నని పలికి వెండియు నిట్లనియె. 77

తే. నిజతలోఁ దరిప్రార్థింప నీవు నన్నుఁ
గానుపీసంబులఁడుగుట కాసచేసి
వచ్చి యూరకయున్న నీవాంఛఁ దెలిసి
యిచ్చి తైశ్వర్యవిభవంబు లింత లేసి. 78

తే. తొల్లియును బోలె లేములఁ దల్లడింప
కన్న మమృతంబుగలిగి నీ యాలుబిడ్డ
లెల్లసౌఖ్యంబులను బొంది హితులఁగూడి
యనుభవింతురు నీధర్మమున మహాత్మ. 79

ఆ. కలిమిగలిగె ననుచుఁ గండకావరమున
బొగరుపట్టి యట్టు బొందనేల
బీదలకును బంక్తి భేదంబు నేయక
నన్న మిడఁగవలయు నతిథులకును. 80

సీ. అరయఁ 'బరోపకారార్థ మిదం శరీ
ర' మ్మనువాక్యసారము గ్రహించి
ధరణిలోఁ బ్రజలకుఁ దనచేతనైనట్ల
నేమార్గముననైన హితమొనర్చి
స్మృతు 'లనిత్యాని శరీరాణి' యనుమాట
లాదరించుచు మేను లదృఢములుగ
గణుతించి ధర్మార్థ కామమోక్షములకు
మనసాగ్ని సుకృత మేమఱకొనర్చి

తే. గరిమతోడ 'శుభస్య శీఘ్ర' మ్మనంగఁ
దెలిసి యత్యంతవిజ్ఞానతేజమునను
సకలధర్మంబులందును జాడ్యముడిగి
నన్నుఁబూజింపవలయుఁ గృష్ణ నమహాత్మ. 81

క. సన్నాహంబును 'నిత్యం
సన్నిహితోమృత్యు' వనెడి చదువులు విని వి
ద్వన్నుత సేయఁగవలయును
మున్నగధర్మంబు శీఘ్రముగ మర్త్యులకున్. 82

క. పరికింపఁగ 'ధర్మస్య
త్వరితాగతి' యనఁగవిని వృథాదివసంబుల్
జరుపక యతివేగమె మ
చ్చరణసమారాధనములు సలుపఁగవలయున్. 83

క. విస్తారంబుగ 'గ్రామో
నాస్తికుతస్సీమ' యనెడి న్యాయముతోడన్
బ్రస్తుతి సేయనిమూఢున
'కస్తావ్యస్తములు' సుఖము లందును నిందున్. 84

క. శ్రీయుతుఁడై యన్యులకున్
ఏ యెడఁ గీ డాచరించుహీనజనుఁడు పా
పాయ పరపీడన' మ్మను
న్యాయమ్మున రౌరవాదినరకములఁ బడున్. 85

క. కలుషములె దరిద్రత్వము
కలుషము లెప్పుడును సిరులు గల్గియు సత్పా
త్రుల కీనేరనిమనుజులు
కలియుగమునసనధికదుష్టకర్ములు జగతిన్. 86

క. క్షేత్రమెఱిఁగి విత్తనమును
బాత్రమెఱిఁగి దానములను బఱపఁగవలయున్

ధాత్రీజను లదియెఱిఁగియుఁ
బాత్రుల కీయంగవలయుఁ బసిఁడిగలిగినన్. 87

క. మునినాథ పూర్వభవమున
ధన మార్యులకిచ్చినట్టి తత్సుకృతమునన్
మనుజుం డన్యభవంబున
జనపతియై సకలభాగ్యసంపదలందున్. 88

క. ఏపట్లఁ బుణ్యపరులగు
భూపాలురయొద్ద నేను బొందగనుందున్
బ్రాపై "నావిష్ణుః పృథి
వీపతి" యనుస్మృతులమాట వృథగాకుండన్. 89

క. సిరిగలవారికి వశ్యులు
నరనాథులు భూమిప్రజలు నానాదిశలన్
సరసిజమందిర యెచ్చట
నిరవై యుండఁదగునచట నేనువసింతున్. 90

క. శ్రీనలినాస్యకుఁ దోడుగ
నేనతఁడై యుందుఁగాక నెచ్చటఁ జెల్లున్
మానవపతియానతి "రా
జానుమతో ధర్మ" యనఁగ నఖిలధరిత్రిన్. 91

తే. సిరులు లేనట్టిమనుజుండు మరణమైనఁ
జావకుండిన నదియొక్క సమముగాదె
తథ్యముగ "నిర్ధనస్యమృతస్యచ" యను
మేటిపౌరాణికులమాట మేలు తెలియ. 92

ఆ. దానమనుచు సకలధన మపాత్రులకును
వెచ్చ వెట్టుటదియ వెఱ్ఱితనము
దీనులైనభూమిదేవోత్తములకును
దాన మీఁగవలయుఁ దగినకొలఁది. 93

క. ఘోరముగ వెఱ్ఱికోఁతికి
వీరుల శివమెత్తినట్లు వెచ్చముసేయన్
గోరిక మును దనుఁదిరిసిన
వారల మరలంగదిరియ వలయునుజుమ్మా. 94

క. కూడినద్రవ్య మపాత్రుల
కాడంబరవృత్తినొసఁగ నది వృథయె యగున్
బూడిదెలో హోమమువలెఁ
బాడింటికినిడిన దీపపంక్తియుఁబోలెన్. 95

ఆ. దేవపూజయతిథిదీనరక్షణమును
బంధుపోషణంబు ఫలితముగను
దానధర్మములను ధనముగలకొలంది
నాచరింపవలె గృహస్థునకును. 96

క. స్నానము సంధ్యయు జపమును
మానుగఁ బితృతర్పణములు మఱువక మది ని
త్యానుష్ఠానము లెడపక
మానవుఁ డొనరింపవలె సమస్తము తెలివిన్. 97

క. పరికింప స్మృతి "యహింసా
పరమోధర్మ" యనుచుఁ దగఁ బలికెడుకతనన్

ధర సర్వజీవులందును
గరుణయు పాటింపవలె నకల్మషవృత్తిఁ. 98

ఆ. తేరుక్రిందిప్రతిమ తెఱఁగున సంసార
భార మాని యందుఁ బరవశుండు
గాక మానవుండు గల్మషవిరహితుఁ
డై చరింపవలె మహామునీంద్ర. 99

సీ. మానకస్మృతులు 'జ్ఞానేనహీనః పశు
భిస్సమానో' యని పేర్మిఁబలుక
వేదంబు మఱియు 'జ్ఞానాదేవమోక్షో' య
నంగ విజ్ఞానాంతరంగమునను
విమలశరీరుఁడై వివిధధర్మాధర్మ
మార్గభేదంబు లేమఱక తెలిసి
తనకుఁ బాకము సేయు మనకయ్యఖిలపర
మార్థంబులును దేవతార్పణముగఁ

తే. దలఁచియు నసాక్షిభుక్తి యెత్తఱిని గొనుట
మాని మధ్యాహ్నవేళఁ గ్రమ్మఱెడు నతిథి
యాఁక లెఱిఁగి సమస్తజీవాత్ములకును
సమత వర్తించునతఁడెపో సజ్జనుండు. 100

తే. 'కాకులకుఁ గాని వేములు ఘనతరముగఁ
బండె నే మెండె నే' మన్నపగిది నతిథి
బాంధవులకును గానిసంపదలు నరుల
కుండె నేమియు మఱియు లే కుండె నేమి. 101

ఉ. మూఁడలు సంతరించుకొని మచ్చిక నెవ్వరి కీఁగలేక ప
ల్పిడలుమేనులం బొరయఁ బెక్కురుచోరులు బాధపెట్టఁగా
గో డనియేఁచ్చుచుఁ భ్రమలఁ గుందుశరీరుల నేనువెత్తునే
చూడసమ స్తకర్మపరిశుద్ధులకిత్తునుగాక మోక్షముల్. 102

తే. తస్కరులు భూమిపతులు వి త్తములు బలిమిఁ
బొదివికొనిపోవఁ జూచు చుండుదురుగాని
యీఁగలిగి యేరికిని దగ నిడఁగలేని
కష్టలోభుల కేల సద్గతులు గలుగు. 103

తే. పిసినియగువాఁడు నెవరికిఁ బెట్టనట్టు
పైసిమాలినకృతకర్మభ్రష్టుఁ డిలను
బరమచండాలుఁ డహహా యెపట్లనైనఁ
దలఁచు దగలోభికంటెఁ బాతకుఁడు గలఁడె. 104

ఆ. తనువుగురువులకును ధనము బ్రాహ్మణులకు
మనసు నిష్టదేవమునకు నొసఁగి
భూతదయయు సుకృతబుద్ధిశుద్ధియుఁగల్గి
పరఁగువాఁడె నాకు భక్తుఁ డనఘ. 105

క. ధర్మాత్ముం డభివృద్ధియు
దుర్మదుఁడు లయంబునొందు దోషంబులచే
'ధర్మమెజయముధరిత్రి న
ధర్మమెలయ' మన్నమాట తథ్యముగాఁగన్. 106

వ. కావున నీవు సకలభూతంబులయందును ధర్మంబునుంగలిగి
స్నానజపాద్యనుష్ఠానంబులు మొదలైన బ్రాహ్మణకర్మంబు

లేమఱక, ఋగ్యజుస్సామంబులు నియమంబునం బఠిం
పుచు ననాసక్తిభుక్తం బయుక్తంబని తెలిసి యతిథులం
బూజింపుచు, హింసాకర్మంబులు వర్జించి, కామక్రోధలోభ
మోహమదమాత్సర్యంబులు వెలుఁగనీయక, యత్యంత
విరక్తుండవై శాంతాకారంబునం బ్రవర్తింపుమని చెప్పి
పరమాత్ముం డైనహరి యంతర్ధానుండయ్యె నప్పుడు. 107

క. కమలము నీరున నుండియుఁ
గమలంబున నంటనట్టికరణిని సంసా
రమునఁ బ్రవర్తించుచు నా
యమలినచిత్తుఁడు విరక్తుఁ డై విహరించెన్. 108

ఆ. ఈకుచేలుచరిత మిలలోన నెటువంటి
మనుజులైన వ్రాసినను జదివిన
వినినఁ దద్విధముల వివరించినను వారి
కాయురర్థములు చిదాత్ముఁ డొసఁగు. 109

క. అనినఁ గిరీటికుమారుని
తనయుఁడు శుకయోగివాక్సుధారసపానం
బొనరించినపిదప వినియెఁ
దనివిసనక భాగవతకథాసూక్తంబుల్. 110

శా. బృందారణ్యవిహారగోపకులసద్బింబాధరీగోపగో
బృందానంద కళింగమర్దన మహీబృందారకాధీశ భూ
మందారద్రుమ నందనందన మహామాయావినోదక్రమా
మందప్రాభవ కృష్ణ దేవహరిశ్రీమన్నామరామానుజా. 111

క. నీలాంబరావరజ హరి
నీలాంబుదవర్ణ దేహ నిర్మలయమునా
కేళిప్రియ భక్షితగో
పాలక బాలకసహాయ పర్యుషితాన్నా. 112

పంచచామరము. బలారికల్పితోరువర్షపాతవాతవారణా
ప్రలంబపూర్వనిర్జరప్రభంజనాత్మరంజనా
పుళిందకన్యకాకుచప్రఫుల్లగండపాళికా
గళప్రదేశభాసమానకౌస్తుభస్థితాంకితా. 113

గద్య. ఇది శ్రీమచ్ఛ్రీమరాంబికావరప్రసాదలబ్ధ సరసకవితాధు
రంధర సకలకవిమిత్ర యల్లనామాత్యపుత్త్రి సకలసద్గుణ
విధేయ గట్టుప్రభునామధేయప్రణీతం బైనకుచేలోపాఖ్యా
నం బనుమహాప్రబంధంబునందు సర్వంబును దృతీయా
శ్వాసము సమాప్తము.

శ్రీరస్తు.

# కుచేలోపాఖ్యానము.

## టిప్పణము.

---

1. శ్రీమత్...విచక్షణుఁడు = కాంతిమతులైన గొల్లభామలయొక్క వింత వింతలైనకోకలయొక్క (కోకలను) దొంగలించుటయందలినేర్పుచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడును; తాపస...భక్షణుఁడు=మునికాంతలచే నియ్యఁబడినమేలిమియాహారమును, మిక్కిలితియ్యనైన భక్ష్యములను ఆరగించువాఁడును; సకల...కుండు = గొల్లభామలయందఱియొక్క (ని) వశపఱచుకొనుటయందు మెప్పువడసినపిల్లనగ్రోవి నూఁదువాఁడును; ధేను...కుంతలుఁడు = ఆవులగొరిజలకొనలచే లేపఁబడినదుమ్ముచేఁ గొంచె మెఱ్ఱనైన కురులుకలవాఁడును ; ధర...విదారణుఁడు = పర్వతములను బ్రద్దలగునట్లుమోసపురీతితోఁ గురిపించిన ఱాలవాన నాఁపినవాఁడును; (అయిన) మదన... రమాధవుఁడు = మన్మథునితండ్రియైన గోపాలకృష్ణావతారమెత్తిన లక్ష్మీపతి, చెలఁగి = ప్రకాశించి, జగములన్ = లోకంబులను.

2. వెసన్=తగినట్లు, జగత్ప్రసిద్ధి = లోకమందుఁగీర్తి, మోహపుంబాలుఁడై=గారాబపుబిడ్డఁడై, నిర్మలపరమబ్రహ్మము = నిర్దోషుఁడైనపరమాత్మను, కొండు=పుచ్చుకొనుఁడు (కొనుధా. ప్రేర. ప్రా. బ.) (చాలన్-చాలన్-అతిశయార్థమందు ద్విరుక్తి) సర్వంకష ఐశ్వర్యముల్ = అన్నివిధములైనకలుములును, (ఐశ్వర్యము, వ్యు. ఈశ్వరునిభావము. సర్వంకష + ఐశ్వర్యముల్ = సర్వంకషైశ్వర్యముల్-వృద్ధిసంధి.)

3. మానినులకున్ = అందకత్తెలకు, మన్మథ...నిపుణుఁడు=మరునిసుఖకేళియందునేర్పరి, చిరాయు...నులన్=దీర్ఘాయుస్సును, ద్రవ్యమును, సంపదను.

4. గోబ్రాహ్మణేభ్యః శుభం నిత్యం అస్తు = గోవులకొఱకును బ్రాహ్మణులకొఱకును మేలు ఎల్లప్పుడు కలుగుఁగాక. ఆర్యులు=పెద్దలు, ఆడఁగ=పలుకఁగ, కారుణ్యమునఁ=దయచేత, లోకాః=సమస్తజనులును; సుఖినః = సుఖముగలవారు, భవన్తు = అగుదురుగాక. మౌనులు=ఋషులు, వేదతతిఁ = వేదముల సమూహమునందు, ధృతిఁ=సంతోషముతో, నమ, బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయచ=గోవులకు బ్రాహ్మణులకుమేలొసఁగెడి బ్రహ్మకొఱకును నమస్కారము. ఆమ్నాయములు=వేదములు, గణుతింపఁగాఁ = యోచింపఁగా, బ్రాహ్మణా శీర్వాదాః-న-మోఘాః = బ్రాహ్మణులదీవనలు. వ్యర్థములుగానివి, శౌరి = కృష్ణుఁడు, అత్య...సారమునఁ = ఎక్కువదయతో, ధేనువులను = గోవులను.

5. చతుర్దశభువన = పదునాలుగులోకములు, నందనుఁడు = పెంపుఁడుపుత్రుఁడు, కుమారుఁడు=గర్భజనితుఁడైనపుత్రుఁడు, పూతనా=ఆపేరుగల యొక రాక్షసి, దావానల = కాఱుచిచ్చు, వ్రజసుందరీ = గొల్లతను, మాన=గౌరవమును, కాళింగ...భంజనుఁడు=కాళింగుఁడనురాక్షసుని గర్వమునడఁచినవాఁడు, కపట...ప్రమోదుఁడును = బూటకపుమానుషావతారమందలి యాటలచే విహరించువాఁడు, నరనాయక=రాజులయొక్క, విదారణుఁడు = పోఁగొట్టువాఁడు, చాణూర...కారణుఁడు = చాణూరుఁడనియెడిజెట్టిని జంపుటకుఁగారణమైనవాఁడు, విప్రాంగనా...హంసుఁడు = బ్రాహ్మణ కాంతయొక్క మానసంబు లనెడికమలములకుసూర్యుఁడైన వాఁడు, సూర్యుఁడు కమలములను వికసింపఁజేయుచుండంబున మునికాంతల మనస్సులను సంతోషపెట్టువాఁడు, సకల...స్ఫురుండును = తనయావత్తు కాంతిచేతను నూఱుకోట్ల సూర్యులను మించినవాఁడును, సమస్త...భావుఁడును = దెసలన్నిటియందు వ్యాపించిన మహిమగలవాఁడు.

6. అవనిసురభామిని=బ్రాహ్మణి, అద్దమరెయి = (అద్ద + రెయి) సగమురాత్రియందు, స్వప్నముఁ = నిద్రయందు, శ్రీకంఠసాధ్వి=శివునిభార్యయగు భ్రమరాంబిక, వాక్ప్రౌఢిమమును=మాటలందలి నేర్పు.

7. ఈపద్యమందుఁ జెప్పఁబడినవారు సంస్కృతమహాకవులు.

8. చకితమనస్కులు=వెఱపుగలమనస్సుగలవారు. సుకృతులు=చక్కని గ్రంథములు.

9. ప్రబంధములు=కావ్యములు, తద్జ్ఞులు=ఆకావ్యరసముల నెఱిఁగినవారు. భ్రమరా...వాక్యములు = భ్రమరాంబికయనుగ్రహమువలనఁ గలిగిన కవిత్వధోరణులు.

10. చిత్తాంబుజమునన్ = కమలముం బోలెడిమనసునందు. సృజింతున్= పుట్టించును. అస్మదీయ=మాదైన.

11. అతిసుధావిస్ఫురణల్=అమృతమును మీఱిన యూహలు.

12. భ్రమరాం...ప్రవీణతన్ = భ్రమరాంబయొక్క యనుగ్రహమువలనఁ గలిగినమంచికవనధాటిచే, ఘటికా...మహిమకున్=గడియకునూఱుపద్యములఁ జెప్పఁగలచాతుర్యమువలని గొప్పదనమునకు, ప్రౌఢిమన్ = నేర్పుతో, ఏకపక్షమాసమహాప్రబంధకల్పనశక్తిన్ = ఒక్కొక్కపక్షమునకును, ఒక్కొక్క నెలకును ఒక్కొక్క గొప్పకావ్యమును రచించుటయందలి నేర్పుతో, ఆశువు ...గల్భనంబునన్=ఆశుకవిత్వము, చిత్రకవనము, మధురకవిత్వము వీనియందు నేర్పు మాపుటచే, శ్రీకుధర...సుండను=శ్రీశైలపర్వతమునందు వెలసియుండు మల్లికార్జునస్వామియొక్క కాంతిగలకమలంబులవంటి పాదములందు మడించిన తుమ్మెదయగు మంచిమానసంబు గలవాఁడను, సత్కృ...వశుఁడను=చక్కని కవులదయతోడి యనుగ్రహమునకు లొంగినవాఁడను.

13. వాంఛలు=కోరికలు. సముదిత ఆనందునకున్ = ఎక్కువసంతసముగలవానికి.

షష్ఠ్యంతములు—షష్ఠీవిభక్తులే యంతముగలవి యని యర్థము.

14. భూసురవనితా...నస్కునకున్ = బ్రాహ్మణకాంతలచే నియ్యఁబడిన ప్రకాశించుపక్వములైనవంటకములను, భక్ష్యములను, పానములను ఆరగించుట యందుఁ గోరికగలమనస్సుగలవానికి. అనుపమ...రమణీయునకున్ = సాటిలేని గొల్లలక్రీడలచే నొప్పినవానికి.

15. బాణాసుర...విత్రుసకుఁ=బాణాసురుని యొక్క చేతులనెడితీఁగలకు గొప్ప కొడవలియైనవానికి. (కొడవలి తీఁగలను గోయునట్లు బాణాసురుని చేతులను ఛేదించినవానికి.)

16. శమిత = సంహరింపఁబడిన, బృందారక...సంహారునకుఁ = దేవతల యొక్క యెక్కువమాయచేఁ గలిగినజాలవాననుబోఁగొట్టినవాఁడు.

17. స్త్రీకృత...శైలునకుఁ=గొడుగుగాఁ జేయఁబడిన కడుగొప్పదైనమందరమనుపర్వతముగలవానికి (మందరపర్వతమును గొడుగుగా నెత్తినవానికి).

18. పరిరంభణ = ఆలింగనము. పరిణయకేళీవిలాస=పెండ్లియనెడి వేడుకసొంపుచేత.

19. అస్ఖలిత=పొరఁబాటుపడని. వర్ధిష్ణునకుఁ=వృద్ధిచేయువానికి.

21. ఆమోదమునఁ = సంతోషముతో. వాక్ప్రభుత్వము = మాటలందునేర్పు.

22. పంటపొలఁతికి=భూదేవికి. రత్న ఆభరణంబు=రతనాలసొమ్ము.

23. సదనము=నివాసస్థలము. వేదులు=తిన్నెలు. నైష్ఠికతలు=నియమములు, యాజులు=బ్రాహ్మణులు. భర్మ=బంగారము. మచ్చికలు=ప్రేమలు, మదవారణములు=మదపుటేనుఁగులు. కట్టుంటములు=మిక్కిలిసొగసైనవి. నెట్టన = ఎక్కువగా. వేలుపుఁజేడెలఁ=అప్సరసలను. యానంబులు = వాహనములు. రహించెను=మించెను.

24. పట్టు=విశాలమైనది.

25. బృందములఁ=గుంపును. పేర్మి=కీర్తిని.

26. ఆత్మవత్ సర్వభూతాని=అన్నిప్రాణులు తనవలెనే (తలఁపవలయును). మునిచక్రవర్తి=మునీంద్రుఁడు. శాంతి=మనసునణంచుట. దాంతి=వెలుపలియింద్రియములనణఁచుట.

27. జఠరాగ్ని=ఆఁకలియనుచిచ్చును. వరిటినాఁడు=చిక్కిపోయెను. (ఈ పదమన్యదేశ్యముగాఁ గానఁబడుచున్నది.) నిజస్వాంతము = తనమనసు. శతసహస్ర... త్తరియంబు = లక్షచింపులతోఁగుట్టినపాఁతదై చివికినపైబట్టను. రమ.

ణాౙ = ప్రీతితో. కుచేలుఁడు = చినిఁగినబట్టగలవాఁడు. మహామహుఁడు = ఎక్కువతేజస్సుగలవాఁడు; పిక్కటిల్లౙ = నిండుచున్నట్లు.

28. స్వదేశః భువనత్రయమ్ = మూఁడులోకములును తనదేశమే.

29. ఇదంబ్రాహ్మ్యం=ఈబ్రాహ్మణసమూహము, వేదమూలమ్=వేదమేకారణముగా (ప్రమాణముగా) గలది. త్రయీ=ఋక్కు యజుస్సు సామము అను మూఁడువేదములు. శరీరపోషణః=దేహమునుగాపాడునట్టిది. భార్యాసమః=భార్యతో సమమైనది. నాస్తి=లేదు (=శరీరమునుపోషించువిషయములో భార్యకంటె మించినదిలేదు.) సతిౙ=సుగుణములుగలదానిని. అపుత్రస్య = బిడ్డలులేనివానికి, గతి=మోక్షమార్గము, నాస్తి=లేదు. (బిడ్డలులేనివారికి పుణ్యలోకములులేవు.) కతనౙ=కారణమున.

సతతం=ఎల్లప్పుడు. నివాసః=ఉండుచోటు, ఏకః=ఒకటియే, పట్టణం వా వనం వా=పట్టణమైనను లేక అడవియైనను సరే. (మహాత్ములకిదియూరు ఇది యడవియనుభేదములేదు. అడవిరెండును సమానములే). కానలౙ- ఎ=అడవులయందె, స్మృతి=పురాణాదులు. కేశవాత్-పరం-దైవం-న (అస్తి)=విష్ణువునకంటెమించిన దైవము లేదు. సమారాధనము=పూజ.

వారిజాక్షు=కమలమువంటి నేత్రములుగల యావిష్ణువుయొక్క.

30. సుగుణఉద్దామతౙ = మంచిగుణములచే మించినది యగుటచేత. వామాక్షి=అందమైనకన్నులు కలది (ఉత్తమకాంత).

31. పేదతన...విధి - ఇది...తనము. 'పేదవారికే కదా బ్రహ్మదేవుఁడు పెక్కురుబిడ్డలనిచ్చును? భాగ్యవంతులు కావలెనని కోరినను ఇయ్యఁడే? ఆహా! యిదిగొప్పవింతగానున్నది? అని తా.

32. ఇంతులందుౙ=స్త్రీలయందు.

33. గ్రాసము=ఆహారము.

34. దూసరొడ్లు = నెవ్వరిధాన్యపుగింజలు. ఇది "దూసరివడ్లు" అనియుండవలెను. లతాంగి-తీఁగవలె సన్నని దేహము గలది.

35. మట్టుపెట్టౙ=చంపను.

36. కోకలు=పంచెలు. బుడుతలకు = పిల్లవాండ్రకు. గోములు = సౌఖ్యములు.

37. అధిపునకుఁ = భర్తకు. ఒడ్డారము=అలక్ష్యము. ఎలమిఁ=ప్రేమతో. పురుడునకుఁ=సావాసమునకు. కుస్తరించును=ఓదార్చును. ప్రామిడిఁ = కోపముతో.

40. పోరామిని=శ్రమతో. సాటిబోటులు=సరియీడువచ్చినకాంతలు.

41. చింతాభరంబునఁ = దుఃఖాతిశయంబుచేత. పారావారము=సముద్రము. తెరియింపఁ=దాఁటుటకు.

42. జిహ్వాత్వక్ ఆదిసుస్థిరతర దుష్టఇంద్రియ అనీకముల్ = నాలుక, చర్మము మొదలగు మిక్కిలిశాశ్వతములైన చెడ్డయింద్రియముల సమూహమును. కుదియంగఁ - పట్టి = లోపలనణఁచిపెట్టుకొని. పర్ణ... క్షణంబులు = ఆకులు ఉదకము గాలి మొదలగువానిని ఆహారముగాఁగొనుటను. తనువు = దేహము. నిజశల్యశక్తిసూత్రముగఁ=తనయెముకలసత్తువయే మిగిలియుండునట్లు.

43. కకుత్కార్తిమాట = లోభపుమాటను. ఈవాన్నలఁ = ఈవేడికోలలను.

44. సర్వేజనాః సుఖినః భవన్తు = జనులందఱు క్షేమముగలవారై యుందురుగాక.

46. ఎఱుకపిడికెడుధనము=పరిచయమే పిడికెడుద్రవ్యము.

47. విభంజనుండు=సంహారి. కాంతుఁడు=ఒప్పినవాఁడు. ఘటించుఁ = కలుగఁజేయును. భోగమోక్షములకుఁ = ఇహపరసుఖములకు = సాధ్యుఁడు, 'సాధకుఁడు' అనియుండిన బాగు.

48. త్రాణలు=సత్తువలు. లంకె=జత. మ్రుసలె=కల్లలా.

49. స్రుక్కెదరు=వాడిపోవుచున్నారు. పొరయక=చిక్కక. మనుచున్నవారే=బ్రదుకుచురుగదా.

50. రక్త ..భారముఅపంచుఁ = దేహములోని నెత్తుటిని ఎక్కువమాంసమును బీల్చివేయును. పగలు=విరోధములు. లోభములు = ఆశలు. సూనృతవా

క్యము=సత్యమును బ్రియమునైన మాటలను. చూఱంబుచ్చున్ = కోఁగొట్టును. అగ్నికీల = నిప్పుయొక్కమంట. అతిశయ...భూమి = ఎక్కుడయయి యెడతెగకయుండునట్టిచింతకు విహరించుభూమి. లేమికంటెన్ = దరిద్రదశకంటె,

53. భవము=జన్మము. దురటిల్లన్ కన్ = దుఃఖింపను. తోయంబులకున్ = చెడ్డవేళలకు.

54. గర్వఆంధ్యంబునన్=గర్వమువలని గ్రుడ్డితనముచే; స్పృధాకాంక్షన్ = నట్టికోరికతో. ఉర్విన్ = పుడమియందు, ఉపేతులు = కూడినవారు. నిర్వాణుఁడు = మోక్షస్వరూపి. సర్వంజగత్ విష్ణుమయమ్ = ప్రపంచమంతయు విష్ణుస్వరూపము.

56. ఆతతముగన్ = ఎల్లప్పుడు. ఆయుః అన్నం ప్రయచ్ఛతి= మనఆయుః కాలమే మనకన్నముపెట్టుచున్నది.

57. సారెకున్=మాటిమాటికి. పొగిలెదవు = దుఃఖించెదవు.

58. కృతం శుభాశుభం కర్మ అవశ్యం అనుభోక్తవ్యమ్ = తొల్లిటిజన్మంబునఁజేసిన మంచిదో లేకచెడ్డదో యైనకర్మ తప్పక యనుభవింపవలయును. అదానదోషేణ దరిద్రః భవేత్ =మానవుఁడు పూర్వజన్మమున లోభియై యొక్కరికి నేమియుఁ బెట్టనివాఁడగుటచే నీజన్మంబున దరిద్రుఁడగును. ధనప్రకర్షేణ పుణ్యం కరోతి=హెచ్చుధనముచే (భాగ్యవంతుఁడు) పుణ్యముసంపాదించుచున్నాఁడు. పాథేయము=దారిబత్తెము. క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి=జనులు తామొనరించినపుణ్యముక్షీణింపఁగానే మఱల భూలోకంబునకు వత్తురు. జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత = స్వర్గముంగోరువాఁడు జ్యోతిష్టోమమనెడు యాగముచే దేవతలను ఆరాధింపవలెను. పర్ణకీటంబులంబోలెన్= ఆకుపురుగులవలె. జాతస్య మరణంధ్రువమ్ = పుట్టినవానికి గిట్టుటనిక్కము. పృథివిఅప్ తేజోవాయు ఆకాశమయంబులు = మన్ను. నీళ్లు. వెలుఁగు. గాలి. ఆకాశము అనుపంచభూతస్వరూపమైన.

60. శిక్షానుగుణ్యుల్ =శిక్షించుటకుఁదగినవారు. పుత్రంమిత్రవత్ ఆచరేత్ =కొమారుని 16 ఏండ్లయీడుకుమించినతర్వాత చెలికానివలెఁ జూడవలయును.

61. ఇందుముఖులమీఁదిపలపు=చంద్రునిఁబోలు ముఖములుగల సుందరుల యందలి ప్రేమ. ఆత్మయందు = మనసులో.

62. సతులు=పెండ్లాలు. వెక్కరులకు=మూఢులకు.

63. చెల్లిరో=చచ్చిరో.

65. శతధృతి=బ్రహ్మదేవుఁడు.

66. ఏకఃవిష్ణుః మహద్భూతం=విష్ణుడొక్కఁడె గొప్పదైవము.

67. ఆత్మలన్ = జీవులను. సమయించున్ = సంహరించును. రాజాయథా తథాప్రజాః = రాజెట్టివాఁడో ప్రజలునట్టివారై యుందురు.

69. ఎలమిన్=వేడుకతో. కృతము=పాపకార్యము. దుష్కృతంబులన్= ఎక్కువకష్టములను, నవమాసములు=9 నెలలు.

70. తొంటిబుద్ధులు=ముందటితలంపులు, నిచ్చలు=ఎల్లప్పుడు.

71. జీర్ణకంథకమును=ప్రాఁతదైనకుబుసమును; బొందిన్=దేహమును,

73. వేసటన్=శ్రమచేత.

74. భిన్నుఁడు=పగలినవాఁడు. యత్ దృష్టంతత్ నష్టం=ఏది ప్రపంచమునం దుఁగంటికిఁ గనఁబడుచున్నదో అది కొన్నిదినములకుఁ గనఁబడకపోవును.

75. వగన్=దుఃఖముచే. పొగులు=విచారపడు. ఖగగమనుఁడు = జగన్నాథుఁడు (గరుడుమీఁద నెక్కి పోవువాఁడు.) ప్రోవక = రక్షింపక. గతి=దిక్కు. మగువ=ఓ చెలీ. మొగసాలకున్ = రాజద్వారమునొద్ద. దుర్బలస్యబలంరాజా = బలహీనునికి రాజే బలము.

78. సతము=శాశ్వతము. వంతులతోన్=పోటీలమీఁద. కాటికిన్ = శ్మశానమునకు. ఇందునిభఆస్యా=చంద్రునిఁబోలు ముఖముగలదానా.

81. పాత్రఅపాత్రతలు = యోగ్యతను అయోగ్యతను. ధాత్రిని = భూమియందు. మాతాపుత్రవిరోధాయ=తల్లిపుత్రుల విరోధముకొఱకు అగుచున్నది.

85. ప్రజలన్=బిడ్డలను.

86. బలువుగాన్=హెచ్చుగా. హాలికుఁడు = కాఁపు. అదను=సమయము. వెదపెట్టక=నాఁటక. తొడసిల్లున్=సంభవించును.

87. భుక్తమునకున్=భోజనమునకు.

90. అలమటలు=చింతలు, ఆఱడి=నింద.

91. వావిరిన్=క్రమముగా, వంటకము=అన్నము.

92. ఇరవుఁబో=ఉనికిగలదగు, ఉరుసంపూర్ణదరిద్రులన్ = కడునిండుపేదలను. నిష్కాములకున్=కోరికలేనివారికి.

93. యద్భావంతద్భవతి = మనస్సులోని యభిప్రాయమునకుఁ దగినట్లగుచున్నది.

97. అన్యథాశరణం నాస్తి = వేఱుదిక్కులేదు. తావలముగన్ = సాధారణముగ.

101. ఆనన్దో బ్రహ్మ = ఆనందమే బ్రహ్మస్వరూపము. మానిత = గౌరవింపఁబడిన.

103. సంగతియే = న్యాయమా. భూమిపులొద్దకున్ = రాజుల సమీపమునకు. (భూమిపులయొద్దకున్) అనియుండవలయును.

104. గరిమ = గొప్పతనము. బల్పరిభవము = ఎక్కువయవమానమును. లాఘవము=అవమానము.

105. అతిపరిచయాత్ ...అవజ్ఞా=ఎక్కువపరిచయమువలన తిరస్కారము గలుగును. సంతతగమనాత్ అనాదరః భవతి = ఎల్లప్పుడు నొక్కనియింటికిఁ బోవుటవలన నలక్ష్యముగలుగును.

106. అథవా=కనిసపక్షమున, సితామ్భోజముఖీ = తెల్లనికమలములంబోలు మోముగలయోకామినీ.

107. ఎట్టకేలకు=విధిలేక. పెరిమెన్=గౌరవముతో, అడుగుటకంటెన్ = యాచించుటకంటె. గౌరవంయాచన అంతమ్ = గౌరవముయాచనయేముగింపుగాఁగలది (అడుగుటచే మానిసికి గౌరవము తగ్గిపోవును. వఘాటి=ఆఁడుది.

108. రంజిలి = సంతసముచెంది. అంజలిపడక = యాచింపక. కొంజక = సంశయింపక. ముంజేయిఆడెనేనిమోఁచేయిఆడున్ = చేతిముందు భాగముగదలిన మోఁచేయియుఁగదలును.

110. కొండికలము = తక్కువవారము. దండి = హెచ్చు. కుశలులు = నేర్పరులు.

111. వారాశికిన్ = సముద్రమునకు. సంపన్నఆఢ్యుఁడు = ధనికులకుమేటి. శౌరికిన్ = విష్ణువునకు. పరిధానంబు=వస్త్రము (దోవతి). ఉరవుపై = ఎక్కువయిన, చొప్పడున్=ఏర్పడును. ధాత్రి=పుడమి.

112. మదనగురునికడకున్ = మన్మథుని తండ్రియైన కృష్ణునివద్దకు. విదితము=న్యాయము.

113. నెరవుగాన్=శుద్ధముగా. కుచేలమునన్=ముతకిబట్ట కొంగునందు.

114. గిరులు=కొండలు. కానలు=అడవులు.

115. ప్రళయములు=చెఱుపుగలిగించునవి.

116. సధనులమే=ధనవంతులమే.

117. పొడఁగాన్పులు=దర్శనములు. బడుగులకున్=చిక్కినవారికి.

119. ఆస=కోరిక. దోసము=తప్పిదమును.

120. డోలాయమాన = ఊఁగులాడుచుండెడి. కటకంబులు = ముండ్లు. బెండువడి = డస్సి. తరుషండంబులనీడలన్ = చెట్లగుంపులనీడలయందు. నిశీథసమయంబులన్ = నడురాతిరులందు. గుడిగుండంబులపంచలన్ = దేవాలయపునంటపపు వసారాలయందు. తట్టుపడి = దూరమునడచుటచేడస్సి. గొంటుపడి=కఠినములై.

122. అభిమన్యునివరతనయుఁడు = పరీక్షిన్మహారాజు. వాంఛలు=కోరికలు.

123. కురువం...గ్ని = కౌరవవంశమనెడి సముద్రమునందలిబోబడబాగ్నిరూపుఁడా. అహూ్ర...గోపక=అహూ్రుఁడు అంబరీషుఁడు మొదలగు సత్పురుషులగుంపునకు రక్షకుఁడవయిన ఓగోపాలా. నిజాంభోజేక్షణా = కమలంబులంబోలు కన్నులుగలవాఁడా. పరిహాసీకృతపద్మసంభవ = పరిహాసము చేయఁబడిన బ్రహ్మదేవుఁడుగలవాఁడా. దృఢప్రజ్ఞాసముల్లాస = స్థిరమైనతెలివియొక్క యెక్కువ విలాసముగలవాఁడా. శ్రీతరుణీనేత్రచకోరశీతకర = లక్ష్మీదేవియొక్క కన్నులనెడుచకోరపక్షులకు చంద్రునివంటివాఁడా. చకోర

పక్షులను చంద్రుఁడు సంతసింపఁజేయునట్లు లక్ష్మీదేవియొక్క కమలములం బోలు కన్నులుగలవాఁడా. దైత్యధ్వంస = రాక్షసులను ధ్వంసముచేయు వాఁడా. కంసఅంతకా = కంసుని జంపినవాఁడా.

124. కుబ్జా...మాల్యాభరణా = కుబ్జయనెడుకాంత మొదలగు చక్కని పడఁతులు కట్టిన మనోహరములైన పుష్పమాలలే యాభరణములు గాఁగల వాఁడా.

125. కరిపోషణా = గజేంద్రునిరక్షించినవాఁడా. నిర్జితకంజభవా=బ్రహ్మను జయించినవాఁడా. మురళీగానవిమోహరవా = వేణునాదముచే వినువారికింపు గలిగించు ధ్వనిగలవాఁడా. వర...భవా = మిక్కిలి పొగడ్తకెక్కిన యాదవ వంశమునందుఁ బుట్టినవాఁడా. గురుధైర్య = ఎక్కువధైర్యముగలవాఁడా. సురక్షితగోపభవా = గొల్లలను గాపాడునట్టియోప్రభూ.

---

## ద్వితీయాశ్వాసము.

3. మీనకర్కట...ల్లాసిఁ = చేఁపలు, ఎండ్రకాయలు మొదలగు తిరుగు చుండు నీటిపక్షులు మున్నగుజంతువుల యొయ్యారముచేఁ బ్రకాశించునది. వనరాశిన్ = నీటికుప్పను (సముద్రమును). తీవ్రలవణ...లాసిఁ = ఎక్కువ ఉప్పునీటిచే నొప్పిన.

4. కర్ణధారకుని = ఓడనడుపువానిని.

5. సంరంభముతోఁ = ఆర్భాటముతో. సువర్ణ...ధంబుతోఁ=బంగారముతోఁగట్టిన మేడలవరుసతో. భద్రఇభయూథంబుతోఁ = భద్రజాతినైన మేటియేనుఁగు గున్నలతో. కలకంఠీనిచయంబుతోఁ = కోకిలవంటికంఠనాదంబుగల స్త్రీలగుంపులతో. బహుతురంగశ్రేణితోఁ=పెక్కుగుఱ్ఱములపంక్తితో. సంతతఉజ్జ్వలమై=ఎల్లప్పుడు ప్రకాశించునదై.

7. పసుగుఆకు = ఎండుసొరుపుటాకు.

8. ఇందు...గములు = చంద్రునింబోలుమోములుగల కాంతలకూటములు. రంగస్థలంబులు = నాట్యశాలలు. ఏణీమద...కంబులు = కస్తూరీకుంకుమముల చేఁదడుపఁబడిననాలుగువీథులుగలిగియుండుచోటులు, ఇక్షురంభా...తోరణంబులు =చెఱకు, అరఁటి స్తంభములందుఁగట్టిన నిండుచివుళ్లుగలతోరణములు. కేళీమహీధరములు = విలాసపుఁదిప్పలు.

9. తనివి = తృప్తి.

10. రంగవల్లులు = ముగ్గులు. తుటుములుగట్టి = గుంపులుగూడి. పుడమివిభులఁ=రాజులను. మదకీలాలంబులు=మదోదకధారలు. ఆలానంబులఁ=కట్టుస్తంభములందు. మదశుండాలంబులకుఁ=మదపుటేనుఁగులకు. సాహిణులఁ=గుఱ్ఱపువారిని. విపంచీ = వీణెయొక్క. వసువునఁ=కీర్తిని. చంచలాక్షులఁ = కదలుగన్నులుగలవారిని.

11. వారణములు = ఏనుఁగులు. తండతండముఁ=గుంపులుగుంపులు. పొచ్చెము = కొఱఁత.

12. అధిగమించి = చూచి (పొంది).

15. పెల్లునఁ = ఎక్కువచేత. కక్షకేశంబులు =. పార్శ్వపురోమములు. తిరులతోడఁ = జడలతోఁగూడ.

22. ధరణీబృందారకునిఁ వికృతినిఁ = రోఁతవచ్చెడిపుడమిదేవుని.

23. కరిమశక అంతరంబు = ఏనుఁగునకును దోమకునువలె భేదము.

24. దుష్టఃసర్వత్రపూజ్యతే=దుష్టుఁ డెల్లచోట్లను బూజింపఁబడును.

27. మహాహ...దులు = గొప్పబ్రహ్మహత్య మొదలగుకార్యములచే మదించినవారు. ఆసక్తులు = పేరాసగలవారు.

28. ఎనయరు = లక్ష్యపెట్టరు.

29. వస్త్రముఖ్యస్త్వలంకారః = అలంకారమునకు వస్త్రములే ప్రధానము. కువలయఅధీశుల కొలువుకూటములఁ=భూమండలాధిపతుల సభలయందు.

31. జోకలు=పరిజనులు.

32. బిట్టు=మిక్కిలి.

33. నెనరులు=తాము మున్ను చేసిన యుపకారములు. పరిభవము = అవ మానము.

34. శరీరమాద్యంధర్మసాధనంఖలు=దేహము ధర్మము సాధించునుపాయ ములలో మొదటిది. అగ్గలముగాన్=హెచ్చుగా. కులకోటింసముద్ధరేత్=కోటి కులములను బోషింపవలెను. అస్థులు=ఎముకలు.

35. దుఃఖితేమనసిసర్వం, అసహ్యం (భవతి)=మనసునవిచారముగలిగినప్పు డేదియు బరువుగానె తోcచును.

37. వేదపాఠఃనిరర్థకః = అర్థజ్ఞానములేక వల్లించినవేదాధ్యయనము ఉప యోగములేనిది.

38. షోడశసహస్ర=16 వేలమంది.

39. వెమకుచున్=సమయమువెదకుచు, బల్ సముఖములు = గొప్పవారిసము ఖములు.

40. దరహాసంబులు=చిఱునగవులు.

41. నిర్వాణులకున్=విరక్తులకు. ఎగ్గు=తక్కువ. విద్వాన్సర్వత్రపూజ్య తే=పండితుc డన్నిచోట్లcబూజింపcబడును. ఉర్విన్=భూమియందు.

42. వివిధానితోయపూర్ణాని=అన్నియు నుత్తనీళ్లతో నిండినవి. రిత్తదంభ ములు=వట్టిజంభములు.

46. బ్రాహ్మణః మమదేవతా=బ్రహ్మము నెఱిcగినవిప్రుcడు నాకు దేవత.

47. సరసి...ననమునన్ = కొలనియందుc బుట్టినదగు కమలమునcబుట్టిన (విష్ణువుయొక్క నాభినుండిపుట్టిన) వానియొక్క (బ్రహ్మదేవునియొక్క) మోమునందు. బ్రాహ్మణఃఅస్యముఖంఆసీత్=బ్రాహ్మణుc డితనికి ముఖమునుండి పుట్టెను. శ్రుతుల్=వేదములు.

48. బ్రాహ్మణోభోజనప్రియః = బ్రాహ్మణుcడు విందుభోజనముచేయుట యం దెక్కువ యిచ్ఛగలవాcడు.

49. జలజనయనుcడు=విష్ణువు. నిర్జరుల్=వేల్పులు (ముదిమిలేనివారు.)

50. బ్రహ్మకులునిశిట్టు=బ్రాహ్మణునిశాపము. అమ్మహోత్తముని దీవనలు=ఆగొప్పవాని ఆశీర్వాదములు. విప్రవాక్యే జనార్దనః=బ్రాహ్మణులమాటయందే భగవంతుఁడున్నవాఁడు.

53. పచ్చనికోకవానికిన్=పసుపు పట్టువస్త్రముగట్టినవానికి. తారకా=నక్షత్రములు. రాకాసుధాకరుండు = నిండుపున్నమచంద్రుఁడు. కంతుజనకున్=మరునితండ్రిని.

57. బుద్ధి=ఆజ్ఞ (ఉత్తరువు).

59. మునీంద్రచంద్రా=మునీంద్రులలోపల శ్రేష్ఠుఁడా.

60. కృపావివేకపద్ధతి =దయయు మంచి చెడుగుల విచారించుతెలివి పద్ధతియు.

61. తరణి=సూర్యుని. సరసిజంబునుపోలెన్=కమలమువలె.

64. బెడంగులై =అందములై. జాలకంబులు=గవాక్షములు. సోపాన=మెట్లు. మృగనాభి=కస్తూరి. చంద్రశాలా=పైమేడ. శాతకుంభ=బంగారుమలాముతో. అంకితంబులును=పూయఁబడినవియు.

65. విద్రుమఓష్ఠి = పవడంపువన్నెగలపెదవిగలది. కోకస్తని = చక్రవాకంబులమాడ్కి నొండొంటితోఁ గదిసినకుచంబులు గలది. కాలాంజిన్ = తమ్మపడిగ. బాగంబులు=పక్కపొడి. ఊరువులమీఁదన్=తొడలమీఁద.

67. మవ్వంబునన్=తిన్నదనముతో.

68. హేళిన్=విలాసముతో. బాలఉన్మత్తపిశాచవత్=పిల్లవానివలె, వెఱ్ఱివానివలె, దయ్యమువలె.

69. భ్రమరమునకున్=తుమ్మెదకు, కీలుకొల్పి=నిల్పి.

73. వీతిహోత్రున్=అగ్నితో.

75. సంగతంబులు=సమాచారములు.

76. పొదలెన్=వృద్ధినొందెను. తనిసెన్=తృప్తినొందెను.

77. అటిముటిన్.

78. తడవుదినంబులకున్ = పెక్కుదినములకు. ఆమలకము=ఉసిరిక కాయ. అంబుధి=కడలి.

79. జాతిఖగంబులు = స్వజాతిలోఁ జేరినపక్షులు. అంబుదశ్రేణికిన్ = వర్షాకాలపుమబ్బులయొక్క వరుసకు. పురులు = నెమ్మిపింఛములు. శిఖిచయంబుల్=నెమళ్లగుంపులు. భూధరఅగ్రంబులన్=కొండల కొనలయందు.

80. అర్క కిరణములకున్=సూర్యునికిరణములకు. నెమ్మిన్=ప్రేమతో.

82. గ్రాసవాసములకున్=అన్నవస్త్రములకు. గహ్వరమునన్=గోప్యముగా. నెలఁతుక=ఆఁడుపడుచు. పంపు=ఆనతి.

84. అభ్యాగతః స్వయం విష్ణుః=అతిథిసాక్షాద్విష్ణుస్వరూపుఁడు.

86. నడికిన్=అన్యాయమునకు.

89. మరియుచున్=ఉపొంగుచు.

91. దుడ్డెలు=బాలురు. జడ్డునన్=భీతితో.

92. బాదరాయణికిన్=వ్యాసపుత్త్రుఁడైన శుకమహామునికి.

95. అంబకైవడిన్=తల్లివలె.

96. మంజులఫణితిన్=ఇంపుమాటలతో.

97. శ్రీలలన...నిజాంశమందులన్ = లక్ష్మీదేవియొక్క తనయంశమందు. లక్షణాఢ్య = శుభలక్షణములుగలది. అలికులవేణి = తుమ్మెదలగుంపువలె నల్లనైన జడగలది. తలఁపునన్ వాక్‌శరీరములన్ = మనస్సువాక్కు కాయము అను త్రికరణములందును.

99. గిరిధరుఁడు=గోవర్ధనపర్వతమును పైకెత్తిపట్టినవాఁడు.

103. రుక్మిణీ...కార్యుండై=తనపనినుండి రుక్మిణీదేవిచే నివారింపఁబడినవాఁడై. అత్యంతతృప్తుఁడు = మిగులసంతోషపడినవాఁడు. అకించనుఁడు = పేద (వ్యు. కొంచెమైనను లేనివాఁడు.) ముగ్ధత్వంబునన్ = మూఢతచేత.

104. ఆకర్ణాంత ఈక్షణలు = చెవులకొనలవఱకునుండు (విశాలమైన) నేత్రములు గలవారలు.

108. ఆడంబరాణిపూజ్యాని = (లోకంబున) డంబముగలవారినే గౌరవింతురు. బడుగులు=తక్కువవారు. బడుగులు=దరిద్రులు.

110. తిరియన్ = యాచించుటకు. చెనఁటి = పేద. కడి + ఎడు = ఒక ముద్దంత.

112. కడి=కబళము.

113. కామితవస్తుజాతములు=కోరినసామగ్రులు అన్నియు. నిర్దయచేత.

114. తార్కాణ=సాక్షి.

116. బలువు=మిక్కిలి. కాంచన అంబరము = పసిఁడిబట్ట. పేర్లు = దండలు. మౌక్తికహారనిర్మలతన్=ముత్యాలపేరులవలె శుభ్రత్వమును.

116. పుత్రజీవికాయలు=రుద్రాక్షలు. ఏపున్=అతిశయమును.

117. భద్రమాతంగవిభునికరణిన్=భద్రజాతియందుఁబుట్టినగజేంద్రునివలె.

119. అగణ్య...నిపుణున్=లెక్కలేని శుభములొసఁగుటయందు నేర్పరియైన వానిని.

121. కట్టిఁడి (కట్టు + ఇఁడి)=క్రూరుఁడు. లేములు = పేదఱికములు.తొట్టును=సంభవించును.

123. హరి. మాయా...నందిత = కపటపుజాలవానవలని భయముచే నఱచునట్టిగోపస్త్రీలు, గొల్లలు, ఎద్దులు, దూడలకదుపులు వీనిని (భయముపాఁపి) సంతోషపెట్టినవాఁడు. మహావాత్సల్య...కళ = ఎక్కువప్రేమగల రాధయొక్క మనస్సును చూఱఁగొను సౌందర్యమును విలాసమును ఒయ్యారమును గలవాఁడా. అహంకార...ఖండన = గర్వముగలవాఁడగు బాణాసురుని యొక్క బడితలవలె నిడుపయినట్టి వేయిచేతులు నఱికినవాఁడా. జగత్క...ఆత్మకా = లోకమునకు మేలొనరించుటయందు నేర్పుగల స్వభావముగలవాఁడా.

124. శరచర=నీటియందుఁ దిరుగునది (చేఁప) మత్స్యావతారము. కచ్ఛప=కూర్మావతారము. కిటి = వరాహావతారము. నరహరి = నృసింహావతారము. వటు = వామనావతారము. భృగురామ = పరశురామావతారము. రామ =

శ్రీరామావతారము. హలి=బలరామావతారము. బుద్ధ=బుద్ధావతారము. మహా ...రూపక=కల్క్యవతారము. స్మర...కార=మన్మథునిఁ బోలురూపు గల వాఁడా. కపట...రీరా=మాయామానుష రూపమెత్తినవాఁడా.

125. సమస్త...పాదా = సకలరాజులచేఁ గొల్వఁబడిన పాదములతోఁ గూడినవాఁడా. రమా...ప్రమోదా = లక్ష్మీదేవియొక్క సౌందర్యముచే నెక్కువసంతసము గలవాఁడా. హిమ...వినోదా=మంచు, పాలుమొదలగు తెల్లని వస్తువులను దిరస్కరించు హెచ్చుకీర్తిచే నొప్పినవాఁడా. విమాలిన్య... ప్రమోదా=నిర్మలమైన బ్రహ్మవిద్యచే నానందించువాఁడా.

---

## తృతీయాశ్వాసము.

---

4. మొదలి పురంబు=శ్రేష్ఠమైన పట్టణమై.

5. కీలిల=పొదుగఁబడిన. ఘూర్ణిత = మ్రోఁగునట్లు చేయఁబడిన. కులగోత్రములు = కులపర్వతములు, కుధరములు = దిష్పలు (భూమిని మోయునవి అని వ్యు.)

6. నెయ్యమునన్=ప్రేమతో.

7. స్యందనములు=తేరులు. సామజములు=ఏనుఁగులు.

10. అవరోధ...రుచులు = అంతఃపురపుటతివలమేనికాంతులు. జాలక = గవాక్షముల.

13. ధర్మః వర్ధతివర్ధతి=పుణ్యముతప్పకవృద్ధిచెందును.

14. యతఃధర్మః తతఃజయః = ఎచ్చట ధర్మమమరియున్నదో అచ్చట జయ మమరియుండును.

17. నిష్ఠురతపః సామర్థ్యుఁడై=ఎక్కువ తపోమహిమ గలవాఁడై.

24. పువ్వుఁబోఁడులు=పువ్వువంటిమేనుగలవారు.

27. జాళువాగిండిని=బంగారుచెంబుతో.

28. అనర్ఘ=వెలలేని.

29. కైదండఒసఁగి=చేయిపట్టుకొని, పైదలి=ఆకుచేల్ఘనిభార్య.

31. కొమ్మలు = కాంతలు, దుకూలాంబరమునన్ = తెల్లనిపట్టుకోకతో, కలపములుకూర్చి = సువాసనద్రవ్యములుచేర్చి. శాల్యన్న = సన్నబియ్యపు అన్నము.

32. కప్పురపుఁదావులు=కర్పూరపుసువాసనలు. బాగాలు=పోకలు.

34. రౌహిణేయానుజ=బలరామునితమ్ముఁడా.

35. కర్తవు = (ఒకపని) చేయువాఁడవు. భోక్తవు = ఆపనివలనిఫలమును బొందువాఁడవు.

36. సామజఘటలు =ఏనుఁగులగుంపులు.

37. అణోఃఅణీయాన్=నీస్వరూపము అణువుకంటె అణువు. అనఁగా మిగుల చిన్నది. మహతఃమహీయాన్ = పెద్దవాటిలో మిక్కిలిపెద్దది. తామసాత్ములు=అహంకారస్వభావముగలవారై. ఆలన్ = భార్యలను. ఘోషముల మీఁదన్=వ్రేపల్లెలమీఁద. వజ్రి=ఇంద్రుని.

40. అనలము=నిప్పు. దధిన్=పెరుగునందు. ఘృతము = నెయ్యి.

42. సంసారదురంతపాశములసందు = సంసారమనెడి తులలేనిప్రగ్గముల నడుమ.

43. శాల్యోదన...తంబులు=సన్నబియ్యపుటన్నము, సూపము, భక్ష్యములు, అప్పుడు వెన్నకాచిననెయ్యియు. మోహంబు=అజ్ఞానము. లోభము = పేరాస. అర్థాతురాణాంనగురుఃబన్ధుః=ద్రవ్యాసగలవారికి గురువు అనువాఁడు లేఁడు. చుట్టమనువాఁడులేఁడు. (అందటికడధనములాగుదురు అనిభావము).

47. ధనముగలవాఁడు తనధనము నెవరెత్తుకొనిపోవుదురో యని మనస్సున భయమునుగలిగి, దొంగలనుజూచినప్పుడు పరుగెత్తుచుండును. దరిద్రునికట్టి దిగులులేదు. " గోఁచిపాఁతపెట్టుకొన్నవాఁడు నట్టడవిలోఁబరుండినను దొంగలభయమతనికి లేదుగదా."

48. అలికి=వెఱచి. నయము=మేలు.

50. నానావిధ...పూర్ణుఁడై=పలుతెఱఁగులైన యన్నిసంపదల నెడి యెమ్మ చీఁకటితో నిండినవాఁడై.

51. అబ్ధితరంగముల్=సముద్రపుటలలు. అంబుదములు=మేఘములు.

53. అన్యులమీఁదిప్రేమ=స్త్రీలమీఁదిమోహము.

54. వృద్ధత్వేమునివృత్తీనామ్=ముసలితనంబునఁదపస్సుచేయఁ బోవువారు.

59. రసనంబు=నాలుక.

60. సతములు=శాశ్వతములు.

61. ఇందీవరఅక్ష=నల్లకలువలంబోలు కన్నులుగల యోకృష్ణా.

64. రాజ్యాన్తేనరకంధ్రువమ్=రాజ్యపరిపాలనమైనపిదప రాజు అపండ్య దండనాదులచే నరకమునకుఁ బోవలయునునట తప్పనివిషయము.

65. ఆశారుజల్=కోరికల నెడివ్యాధులు.

66. ఇందిరాఈశ = లక్ష్మికిఁ బ్రియుఁడా. (ప్రోవుము + అయ్య = ప్రో వయ్య.

67. అట్టు=అల్లరి.

68. గ్రైవేయకము=కంఠహారము. అంగరాగంబుతోడన్=మైపూఁతతో శకటదానవవైరి=శకటాసురునిఁ జంపినవాఁడు.

72. భాగీరథి=గంగ.

73. ఆశాశాపరవందుఃఖమ్ = ఎక్కువైనయాశలు కడుదుఃఖమునకుఁ 7 రణము.

75. దురటిల్లుదున్=చింతపడెదను.

77. అధ్రువంబులు=అశాశ్వతములు.

80. పంక్తిభేదము=పక్షపాతము. అతిథులకును=ఇంటికి వచ్చినవారికిని.

81. పరోపకారార్థం ఇదంశరీరమ్=పరులకుమేలుసేయుటయే ఈశరీరః నకు ముఖ్యకార్యము. శరీరాణి అనిత్యాని=శరీరములు సతములుగావు.

సుకృతములు = మంచికార్యములు. శుభస్యశీఘ్రం = మంచికాలస్యము చేయఁ గూడదు.

82. సన్నాహంబును=ప్రయాణప్రయత్నము. నిత్యం మృత్యుః సన్నిహితః=ఎల్లప్పుడు చావుకాచుకొనియుండును.

83. ధర్మస్యత్వరితాగతిః=ధర్మమునకు త్వరపడుటయే మేలు.

84. గ్రామః నాస్తికుతఃసీమా = ఊరేలేనప్పుడు పొలిమేరయెక్కడనుండి వచ్చును? అస్తావ్యస్తములు=మంచిచెడ్డ లెఱుఁగకుండుట.

85. పాపాయపరపీడనమ్=ఒరులనుపీడించుట నరకమునకే హేతు వగును.

86. క్షేత్రము=మంచిచేను. పాత్రము=యోగ్యుని.

89. నావిష్ణుః పృథివీపతిః=రాజుమానవావతారమెత్తిన విష్ణువు.

90. సరసిజమందిర=కమలాసనయగు లక్ష్మి.

91. రాజానుమతః ధర్మః=ధర్మము రాజసమ్మతమైనది.

92. నిర్ధనస్యమృతస్యచ=పేదవాఁడును, మృతుఁడును సమానులనుట.

94. శివమురెత్తినట్లు=ఆవేశముపట్టినట్లు, తిరిసిన=యాచించిన.

98. అహింసాపరమః ధర్మః=ఒకరినిహింసింపకుండుటయే గొప్పధర్మము. కరుణఅ=దయయే.

100. జ్ఞానేన హీనః పశుభిఃసమానః=తెలివిలేనివాఁడు మృగముతో సమానుఁడు. పేర్మిన్=గొప్పదనముతో. జ్ఞానాత్ + ఏవ + మోక్షః=పరబ్రహ్మ విషయమైన జ్ఞానమువలననే మోక్షముగలుగును.

103. పిసిని=లోభి. బైసిమాలిన=సిగ్గులేని.

107. అసాక్షిభుక్తంబు=రెండవమానిసి లేకుండఁ దానొంటరిగాభోజనము చేయుట.

111. బృందా...నంద = బృందావనమునందు విహరించెడి దొండపండుం బోలుకెమ్మోవిగల గొల్లతలకును, గొల్లలకును, ఆవులమందలకును ప్రీతిగలిగించు వాఁడా. కళింగమర్దనా = కళింగునిఁ జంపినవాఁడా. మహీ...ధీశ = బ్రాహ్మ.

ణులకు దొరయైనవాఁడా. భూమందారద్రుమ = పుడమికిఁ గల్పవృక్షమైన వాఁడా. (స్వర్గమునందలి కల్పము కోరినకోర్కె లొసఁగు చందంబునఁ బుడమినుండుజనులకుఁ గోర్కెలొసఁగువాఁడా.) మహామాయా వినోదక్రమ అమందప్రాభవ = గొప్పమాయలయొక్క కనఁబఱచురీతిచే హెచ్చినసామర్థ్యముగలవాఁడా.

**112.** దండాన్వయము. బలరామునితమ్ముఁడును, నల్లనిమేనికాంతిగలవాఁడును, నిర్మలమైన యమునానదియందు జలక్రీడసల్పుటయం దిష్టపడువాఁడును, గొల్లలుకట్టికొని తెచ్చిన సద్దికూటినారగించినవాఁడు నైన ఓహరీ.

**113.** దండాన్వయము. ఇంద్రునిచేఁ గల్పితమైన ఱాలవానతోఁగూడిన గాలినిపోఁగొట్టినవాఁడును, ప్రలంబుఁడనెడిరక్కసునిఁజంపినవాఁడును, గొల్లతలయొక్క స్తనప్రదేశంబులందును చెక్కిళ్లయందును కంఠప్రదేశమునందును వెలుఁగుకౌస్తుభమణియొక్క గుఱుతుగలవాఁడవు నైన యోకృష్ణా, నీ కర్పించితిని.

---

# ఆంధ్రగ్రంథములు.

# శ్రీమదాంధ్రభారతము.

(పద్యకావ్యము.)

వ్రాతప్రతుల సహాయమున సుప్రసిద్ధులగు పండితులు చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతో బరిష్కరించుచున్నారు. భారతముద్రణము పూర్తికాగానే ఎఱ్ఱాప్రెగ్గడవారి వంశమును ముద్రించెదము. కొద్దిప్రతులే ప్రకటింపఁబడును. కావున వలయువారు త్వరలోనే మాకు తెలియజేయవలెను. గ్రంథము వాల్యములుగా మంచి కాలికోబైండు చేయఁబడి మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తింపఁబడుచున్నది.

| | | | |
|---|---|---|---|
| ఆది, సభాపర్వములుగల సంపుటము | 1-కి ర్పు | 1 | 12 |
| ఆరణ్యపర్వముగలసంపుటము | ,, | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములుగలసంపుటము | ,, | 1 | 12 |
| ఆదిపంచము, ఒకటేసంపుటము | ,, | 5 | 0 |
| శాంతిపర్వము | ,, | 1 | 12 |

తక్కినసంపుటములు అచ్చగుచున్నవి.

# ఆంధ్రప్రబంధములు.

ప్రతి 1-కి రు. అ.

| | | |
|---|---|---|
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము, చక్కనికూర్పు | 0 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 1 | 0 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | 1 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి | 2 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | 2 | 8 |
| డిటో అత్యుత్తమ ప్రతి | 4 | 0 |
| గోపీనాథరామాయణము | (అచ్చగుచున్నది.) | |
| మొల్లరామాయణము, చిన్నవైనను పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | 0 | 8 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధములబాగుగ నున్నది | 3 | 0 |
| మనుచరిత్ర, సటీక | 1 | 8 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, పళసరికాగితములు, చక్కనికూర్పు | 2 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ళ, రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కగ మరలముద్రించినారము | 3 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | 0 | 8 |
| కళాపూర్ణోదయము, పళసరికాగితములు | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాధకవిది | 0 | 10 |
| శ్రీభీమఖండము, ,, | 0 | 12 |
| నరసభూపాలీయము, అట్టబైండు | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవికృతము | 0 | 4 |
| సారంగధరచరిత్ర, చేమకూర, వేంకటకవికృతము | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి నారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవి | 1 | 4 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవిది | 0 | 4 |
| రసికజనమనోభిరామము | 0 | 8 |
| రుక్మిణీపరిణయము | 0 | 6 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది | 0 | 8 |
| పారిజాతాపహరణము, సాధారణప్రతి | 0 | 4 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు | 0 | 14 |
| పంచతంత్రము, నారాయణ కవికృతము, క్రొత్తకూర్పు | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 0 | 12 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము, చక్కగ పరిష్కరింపించి చిన్నసైజున పెద్దచ్చుతో ముద్రించి యున్నాము. | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | 0 | 8 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు | 1 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | 0 | 12 |
| సులక్షణసారము, సటీక | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు 1200 పద్యములు | 0 | 4 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి | 0 | 2 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు, చక్కనికూర్పు | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము సటీక, (భాగవతములోనిది) | 0 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు, మంచికాగితములు | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | 0 | 6 |

| | | | |
|---|---|---|---|
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | | 0 | 6 |
| రాజయోగసారము, ద్విపద, శ్రీతరిగొండ. వెంకమ్మగారిది | | 0 | 4 |
| శ్రీనాథుని వీథినాటకము | ... | 0 | 2 |
| సంగ్రహరామాయణము, సులభశైలి | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | ... | 0 | 12 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర | ... | 0 | 2 |
| దాదాభాయి నౌరోజీచరిత్ర | ... | 0 | 1 |
| అనిబిసెంటుచరిత్ర | ... | 0 | 1 |
| వివేకానందస్వామిజీవితము | ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 1 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీబుద్ధచరిత్రము | ... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము | ... | 0 | 2 |
| సూరతు కాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము, క్రొత్తకూర్పు | | 1 | 4 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1 వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| డిటో రెండుభాగములు, కాలికోబైండు | | 1 | |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 1 | |